# ముందు మాట

దైవసమానులయిన మా తల్లిదండ్రులు బ్రహ్మశ్రీ జూటూరి వేంకట సుబ్బయ్య గారు మరియు శ్రీమతి సీతాలక్ష్మి గారి యొక్క ఆశీస్సులతో,"తెలుగు రాష్ట్రాలలోని దత్త క్షేత్రములు",అనే ఈ చిన్న సంకలనమును తీసుకురావడమైనది. తెలుగు రాష్ట్రాలలో కల దత్తాత్రేయ

క్షేత్రాలు అన్నిటినీ పరిచయం చేయాలని మా ఉద్దేశ్యము. ఎందుకంటే కర్ణాటక, మహారాష్ట్రలో వున్న దత్తాత్రేయ క్షేత్రాలు దర్శించుకోలేని వారు మనకు దగ్గర లో వున్న దత్త క్షేత్రాలను దర్శించుకుంటారు అని చిన్న ప్రయత్నం. ఈ ప్రత్యేక వినూత్న సేకరణ ద్వారా అన్ని దత్త మందిరముల వివరములు,క్షేత్రములు,వాటి చేరుకొనుటకు కావలసిన సమాచారం పొందుపరచటమైనది. దీని pdf తీసుకుని దగ్గరుంచికొనిన ఆ యా ప్రాంతములకు భక్తులు వెళ్లినపుడు సహాయపడగలదు . ఈ ప్రయత్నంలో సహకరించిన కిర్తివల్లభ గారు,శ్రీ జె.వి.సుబ్బయ్య మాష్టరు గారు, వినయ్ గారు,మణిదీప్ గారు,నూకల హరికృష్ణ శర్మ గారు, విలాస్కర్ గారు, బేతనభొట్ల పద్మజ, జూటూరి నాగరాజ కుమార్ గారు, సోమ రమేష్ గారికి దత్త స్వామి ఆశీస్సులు పుష్కలంగా లభించాలని స్వామిని వేడుకుంటూ.....

🙏అవధూత చింతన శ్రీ గురుదేవదత్త🙏

**COMPLIED BY**

**RAJYA LAKSHMI SRINIVAS BODDU PALLI.**

# తెలుగు రాష్ట్రాలలో దత్తక్షేత్రాలు

**దత్త క్షేత్రము: 01: బాపట్ల**

19,20 శతాబ్ద కాలంలో తెలుగు నేల పై జన్మించి,శ్రీ వాసుదే  నంద సరస్వతి స్వామి అనుగ్రహముతో వారి వద్దే దీక్ష పొంది,మహారాష్ట్ర, గోవా,గుజరాత్,వారణాసి లో ఎక్కువగా నివసించిన మహానుభావులు శ్రీ బ్రహ్మానంద తీర్ధ, శ్రీ బ్రహ్మానంద సరస్వతి, శ్రీ భోధానంద్రేంద్ర సరస్వతి,శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి తాత గారు,  మొదలగు అవధూతలు దత్త సంప్రదాయం ని విస్తృతంగా ప్రచారం సాగించి,మన తెలుగు నేలపై దత్తాత్రేయ తత్వం,ప్రచారం చేరిన వారిలో ఉన్నారు.అలాంటి వారిలో శ్రీ బ్రహ్మానంద తీర్ధ గారు 1928 సంవత్సరం లో బాపట్ల లోని శివాలయం లో దత్తాత్రేయ మందిరం కట్టించి,దత్తాత్రేయ పాదుకలు ప్రతిష్ట చేసి,దత్త జయంతి,దత్తాత్రేయ ఉత్సవాలు అన్ని  జరిపించేవారు.ఈ మందిరం రైల్వే స్టేషన్ కి దగ్గర గల శివాలయం లోని వేద పాఠశాల ఉంది. ఈ వేద పాఠశాల కూడా బ్రహ్మానంద తీర్ధ గారు స్థాపించినదే.





**దత్త క్షేత్రము: 02:  మ్రరిపూడి**

ఈ క్షేత్రం విజయవాడ-ఒంగోలు రైలు మార్గంలో అప్పికట్ల దగ్గర వుంది. ఇది కూడా 1926 వ సంవత్సరం లో స్థాపించ బడినది. ఆ వనంలో హిమాలయ నుంచి తెచ్చిన అరుదైన వృక్షాలు ఉన్నాయి.  మ్రరిపూడి దత్త మందిరం,శ్రీ బ్రహ్మానంద తీర్ధ స్వామి ప్రతిష్ఠ చేసింది.**వీరు శ్రీ** వాసుదేవానంద సరస్వతి స్వామి వారి శిష్యులు. ఇక్కడే శ్రీ బ్రహ్మానంద తీర్ధ స్వామి స్వయంగా ప్రతిష్టించిన  శ్రీ దత్తాత్రేయ వనం  చూడవచ్చు. .ఈ వనం మందిరానికి ఎదురుగా ఉంటుంది. బ్రహ్మానంద తీర్ధ... వీరు తుని వారు అని తెలుస్తోంది. కాశీ

లోఆనందానంద తీర్ధ దగ్గర సన్యాసం స్వీకారం చేసి మరలా దేశ పర్యటన చేశారు. వారి మృదు సంభాషణ,ముఖ వర్చస్సు, వైరాగ్యం,సహనం ప్రజలను ఆకట్టుకున్నాయి. ప్రతి ఊరు లోని దేవాలయాల జీర్ణోర్ధారణ, శుభ్రం చెయ్యటం, దత్త మందిర స్థాపన చేసేవారు. సంస్కృత భాషను పునః జీవింప చేశారు. అన్ని పండుగలతో పాటు దత్త జయంతి నిర్వహించేవారు. వీరు ఒక ఊరు నుంచి ఇంకో ఊరు వెళ్లే మార్గంలో ఊరు దాటగానే సంగీత ధ్వనులు, వన దేవతల భజనలు తాళ యుక్తం గా  వినపడేవి. ఎక్కువగా చివరిలో పాలు, వేప చిగురు ఆహారం గా తీసుకొనేవారు. అనేక వేద గ్రంధాలు, పాఠశాలలు నెలకొల్పారు.చివరి రోజుల్లో కాశీ లోని మణికర్ణిక ఘాట్ లో వుండి వేదాంత భాష్యం ను వివరించేవారు. ఔషధం తీసుకోమన్న వారితో ఈ కట్టె కు మందు కూడానా? అన్నారు. 1915,ఆగస్టు,15 వ తేదీ న ధ్యాన నిష్టులు అయి, శ్రావణ బహుళ అష్టమి న యోగశక్తి చే ప్రాణము ను ఛేదించి సర్వ యోగ గమ్యం అయిన కపాల మోక్షం పొందారు. వారి శరీరాన్ని గంగలో జల సమాధి చేశారు.

**RAJYA LAKSHMI SRINIVAS BODDU PALLI.**







## దత్త క్షేత్రము: 03:  శ్రీ విభూది మఠం(శ్రీ శైలం)

శ్రీ పాద శ్రీ వల్లభ స్వామి 16 సంవత్సరాలు పిఠాపురం లో ఉన్న తరువాత గోకర్ణం వెళ్లారని చదువుకున్నాము. ఇక్కడి నుంచి చాతుర్మాస్య దీక్ష కై శ్రీశైలం వెళ్లారు.  ఆషాడ శుద్ధ ఏకాదశి నుంచి  కార్తీక శుద్ధ ఏకాదశి వరకు చాతుర్మాస్యం ఈ శ్రీశైలం దగ్గర గల విభూది మఠం లో ఉండి, అక్కడ అనేక యోగులకు శ్రీ త్రిపురా రహస్యం బోధించారు. ఇక్కడ ఒక బండ ఉంది. ఆ బండ మీద శ్రీ పార్వతి,పరమేశ్వరుడు రాత్రిపూట చదరంగం అడుతారు. వేకువఝామున మరలా శ్రీశైలం లోని గుడిలోకి ప్రవేశిస్తారు. వారు అక్కడ కూర్చున్నప్పుడు స్వామివారి విభూదిని పార్వతి దేవి యోగులు, సాధకులకు తల్లి ప్రేమ తో ఆ బండ మీద రోజు కొద్దిగా పెడతారుట. ఆ బండ మీదవిభూది తో సాధకులు ఉన్నత స్థితికి వెళతారు. ఆ బండ విభూది బండ. ఆ బండ అక్కడ ఉంది కాబట్టి ఆ మఠం విభూది మఠం అయింది. ఇక్కడ శ్రీపాదులు ప్రతిష్ట చేసిన శ్రీ చక్ర సమేత శివలింగం ఉంది.

**రూట్ మాప్**: శ్రీశైలం ప్రధాన ద్వారం నుంచి మల్లమ్మ కన్నీరు(ఇది చాలా ప్రసిద్ధి)వెళ్లే దారిలో విభూది మఠం అంటే ఎవరైనా చెపుతారు.జై గురుదేవ దత్త.

**SOURCE:మణి దీప్.**





## దత్త క్షేత్రము: 04:   వన్నెపూడి,పిఠాపురం

శ్రీపాద వల్లభులు తమ 16 వ సంవత్సరంలో గృహబంధనాది కార్యముల నుండి వెలుపలకు వచ్చి ‘యతి’యై స్వేచ్ఛగా సంచరించుచూ విశ్వోద్ధరణగావించుటకై వారి తల్లిదండ్రుల నుండీ, మాతామహుల నుండీ

మరియు ఇతర ముఖ్యుల నుండీ అనుమతిని తీసుకుని పీఠికాపురం నుండి ఉత్తరఈశాన్య దిక్కుగా యతిరూపధారియై కాలినడకన బయలుదేరెను. వారు అట్లు ఉత్తర దిక్కుగా వెళుతున్నప్పుడు వారి తల్లిదండ్రులూ, మాతామహులూ, ఇతర ముఖ్యులూ శ్రీ పాదులవారి వెన్నంటే రాసాగిరి. ఆవిధంగా పీఠికాపురం నుండి ప్రస్తుతం వన్నెపూడిగా పిలువబడుతున్న ఈ ప్రదేశం వరుకు వారందరూ శ్రీపాదుడి వెనకే వచ్చిరి (దాదాపు 17 KMs). అక్కడవరుకు వచ్చిన శ్రీపాదులవారు ఒకసారి వెనుకకు తిరిగి వారందరిని ఇక ఇక్కడితో ఆగమని సూచిస్తూ ఆఖరిసారిగా తల్లియైన సుమతిమాత నుండి భిక్షను స్వీకరించి, వారందర్ని వెనుకకు పంపి క్షణకాలంలో అదృశ్యులైరి. ఆవిధంగా శ్రీ పాదుల వారి శ్రీచరణములతో పునీతం గావింపబడి 'వన్నె కెక్కిన' కారణంగా ఈ ప్రదేశం 'వన్నెపూడి' గా మారి, చూడచక్కటి గ్రామంగా రూపుదాల్చుకుని గొప్ప దత్తక్షేత్రంగా విరాజిల్లుతోంది. అందువల్లనే ఇక్కడ గల దత్తాత్రేయ దేవాలయానికి 'దత్త బిక్ష మందిరం' (Datta Biksha Mandiram) అని పేరు వచ్చింది. ఇక్కడ శ్రీపాదుల వారు అదృశ్యమైన చోట ప్రస్తుతం ఒక ఔదుంబర వృక్షాన్ని చూడవచ్చు. ఈ ఔదుంబరం క్రిందనే శ్రీపాద శ్రీ వల్లభుల పీఠం నెలకొల్పారు. అదేవిధంగా ఈ క్షేత్రంలో Sripada Vallabha Swamiవారి పాదుకలను చూడవచ్చు. అవధూత చింతన శ్రీ గురుదేవ దత్త. **SOURCE:కీర్తివల్లభ గారు.**





## దత్త క్షేత్రము: 05: నెల్లూరు.

నేటికీ దాదాపు 32 సంవత్సరాల క్రితం బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారు, పూజ్యశ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజ మాస్ట ర్ గారు. ఈ ఇద్దరు మహనీయులు కలిసి 1..11..1987 వ తేదీన ప్రతిష్ట చేసిన శ్రీ దత్త సాయి మందిరం నేడు ఈ మందిరం 32 వ వార్షికోత్సవం. మరో గొప్ప విషయం 1986 సంవత్సరంలో పూజశ్రీ భరద్వాజ మాస్టర్ గారు శ్రీ దత్త సాయి మందిరం నిర్మించడం ముందు ఆ ఇంటిలో లో ఒకచోట కూర్చుని మొట్టమొదటిసారిగా సత్సంగం చేశారు. మందిరం నిర్మించాక వ్యవస్థాపక మేనేజింగ్ ట్రస్టీ శ్రీ కనుపర్తి

సుబ్రహ్మణ్యం గారు, బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి గారిని దత్త విగ్రహం ఎక్కడ ప్రతిష్ఠించాలి అని అడిగినప్పుడు, శ్రీ శాస్త్రి గారు ఒక స్థలం చూపి సరిగ్గా ఆ ప్రదేశంలోనే దత్త విగ్రహ ప్రతిష్ట జరిపించమని ఆదేశించారు. చిత్రమేమిటంటే శ్రీ శాస్త్రి గారు దత్త విగ్రహ ప్రతిష్ట చేయమని ఆదేశించిన స్థలం పూజ శ్రీ భరద్వాజ మాస్టర్ గారు కూర్చొని సత్సంగం చేసిన స్థలం ఒక్కటే కావడం శ్రీ మాస్టర్ గారు సాక్షాత్తు దత్త స్వరూపమని శ్రీ శాస్త్రి గారు సూచనప్రాయంగా ముందే చెప్పారు.. మరో దైవ లీల సరిగ్గా ప్రతిష్ట సమయానికి నెల్లూరులో లో తీవ్రమైన  తుఫాన్, గాలి వాన ల విపరీతమైన వర్షాలు పడుతున్నాయి. మందిర వ్యవస్థాపకులు శ్రీ సుబ్రహ్మణ్యం గారు శ్రీ చందోలు శాస్త్రి గారిని స్వామి వర్షం పడుతోంది ప్రతిష్టకు ఇబ్బంది కలుగకుండా దయ చూడమని ప్రార్థన చేశారు. శ్రీ శాస్త్రి గారు శ్రీ దత్తమూర్తి శ్రీ సాయినాధుని విగ్రహ ప్రతిష్ట పూర్తి అయ్యే వరకు ఒక్క చినుకు కూడాపడదు. అని అభయం ఇచ్చారు. చిత్రంగా ప్రకృతి కి కూడ ఆ మహనీయుని ఆజ్ఞ శిరోధార్యమే ఐయి ప్రతిష్ట పూర్తయి అన్నసంతర్పణ కూడా పూర్తయిన తర్వాత సన్న వర్షపు తుంపరగా ప్రారంభమై ఆరోజు రాత్రి అందరూ ఎవరి ఇళ్లకు వారు చేరిన తర్వాత మాత్రమే సుమారు రాత్రి 11 గంటల నుంచి దాదాపు మూడు రోజులపాటు విపరీతమైన కుండపోత వర్షం తో నెల్లూరు తడిసి అంతటి గొప్ప లీల జరిగిన ప్రదేశం శ్రీ దత్త సాయి మందిరం విగ్రహ ప్రతిష్ట. శ్రీ సాయి లీలామృతం లో మాస్టర్ గారు ఇద్దరు మహనీయులు ఒకే మహత్కార్యం లో కలవడం ఎంతో అరుదు అని రాశారు. కానీ అటువంటి చిత్రమే శ్రీ దత్త సాయి మందిరం ప్రతిష్ట లో ఈ పవిత్రమైన అనుభవాన్ని ఆత్మీయులైన మీ అందరితో పంచుకోవాలని అనిపించి ఆ నాటి సంఘటనను మీకు వివరిస్తూ తద్వారా ఒక్కసారి ఆ మహనీయులను స్మరించుకుని అదృష్టం కలిగింది. అవధూత చింతన శ్రీ గురుదేవ దత్త.





## దత్త క్షేత్రము: 06:   నందవరం(కర్నూలు జిల్లా)

కాశి లోని అమ్మ వారు ఇక్కడ నంద వంశికులకు సాక్ష్యం చెప్పడానికి వచ్చి ఇక్కడే శిలా రూపం లో స్థిరపడ్డారు.నందరాజు రోజు యోగ శక్తితో కాశీ వెళ్లి పూజించేవారు.అక్కడ దత్తాత్రేయ స్వామి కనపడి శ్రీ చక్ర దత్తోపాసన బోధించి ఈ దత్తాత్రేయ పాదుకలు ఇస్తే ఇక్కడ అమ్మ వారి దగ్గర ప్రతిష్ట చేయడం జరిగింది. ఇవి నందవరం లో అమ్మవారి గుడిలో ఉండవు.ఉరి వాకిలి అని వస్తుంది. అక్కడ జ్యోతి మండపం అని వస్తుంది. దానికి ఏదురుగా చెన్న కేశవ గుడి ఉంది.చౌడేశ్వరి అమ్మవారు ఇక్కడ నక్క వాహిని అయి దర్శనం ఇస్తారు.అమ్మ కు ముందుగా ఈ పాదుకలు ఉన్నాయి.నక్క వాహిని అమ్మ,దత్త పాదుకల సమక్షంలో మంత్ర సాధన చేస్తే త్వరగా సిద్ధిస్తుంది. **రూట్ మాప్:** బనగానపల్లె నుంచి 10 km దూరంలో ఉంది.కర్నూలు,నంద్యాల, నుంచి కూడా బస్ లు ఉన్నాయి.రోజూ అన్నదానం కూడా జరుగుతుంది. వసతి కూడా ఉంది. జై గురు దేవ దత్త. **SOURCE మణి దీప్**.







## దత్త క్షేత్రము: 07:   మోగిలిచర్ల

తిరుమల నుండి మంగలి సుబ్బయ్య నుండి విడుదలైన శంకరభట్టు తాను గత జన్మలో మొగిలిచర్ల వాసినని తెలుసుకొని మొగిలిచెర్ల చేరుకుని అక్కడ దత్త పాదాలను ప్రతిష్టం చినాడు. కాల గర్భములో కలసిపొయిన ఈ పాదాలను తపస్వి దత్తాత్రేయుని దత్త ప్రభువు ఆదేశించగా ఆ ప్రాంతములో తిరిగి దత్త పాదాలు ప్రతి ష్టింప బడినవని స్థల పురాణము. ఆ పాదాలను పై చిత్రములో చూడండి.




## దత్త క్షేత్రము: 08:   రాజమండ్రి  శృంగేరి మఠం భక్త వత్సలుడు.

సాక్షత్ శ్రీ వాసుదేవనంద సరస్వతి శ్రీ బ్రహ్మానంద సరస్వతి వారి కోరిక మేరకు ఈ దత్తాత్రేయ స్వామి, విగ్రహం, దత్తాత్రేయ పాదుకలు ప్రతిష్ట చేశారు. వాసుదేవనంద సరస్వతి స్వామి అప్పటి వరకు ఏకముఖి దత్తాత్రేయ విగ్రహాలు మాత్రమే ప్రతిస్థిస్తే మొదటి సారి మూడు ముఖముల దత్త విగ్రహాన్ని ఇక్కడే ప్రతిష్ట చేయడం.దీనికి వాసుదేవనంద సరస్వతి వారేభక్త వత్సలుడు అనే పేరు పెట్టారు.

**రూట్ MAP:** గోదావరి నది వద్దున శృంగేరి శంకర మఠం లోని క్రింద అంతస్థులో ఉన్నాయి.ఇక్కడే స్వామి ఆశువుగా ఈ ప్రతిష్ట మీద 4 స్తోత్రలు రచించడం జరిగింది. జై గురు దేవ దత్త.



**దత్త క్షేత్రము: 09 : ఒంగోలు**

ఒంగోలులో సాయి మందిరం లోని దత్తాత్రేయ మందిరంఈ మందిరం కు శ్రీ భరద్వాజ మాస్టర్ గారు స్వయంగా 16-2-88 లో శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రి తాత గారు ముహూర్తం పెట్టగా శంకుస్థాపన చేశారు.విగ్రహ ప్రతిష్ఠ కు సాక్షత్ శ్రీ వైదేహి అనసూయ మాత వచ్చి ప్రతిష్ట చేశారు. దానికి ముహూర్తం శ్రీ దత్తాత్రేయ స్వరూపము అయిన రాఘవ నారాయణ శాస్త్రి తాత గారు శ్రీ భరద్వాజ మాస్టర్ గారి కోరిక మేరకు శ్రీ jv సుబ్బయ్య మాస్టర్ గారు స్వయంగా దత్త జయంతి కి దత్త నవరాత్రులు శ్రీ రాఘవ నారాయణ శాస్త్రి తాత గారిచే జరిపించారు.ఈ దత్తాత్రేయ మందిరం ముందు కూర్చొని 9 రోజుల్లో గురు చరిత్ర పారాయణ చేసిన వారికి వారికి దత్తాత్రేయ అనుగ్రహం కలుగుతుంది అని శ్రీ తాత గారు స్వయంగా శ్రీ jv సుబ్బయ్య మాస్టర్ గారికి తెలిపారు. జై గురు దేవ దత్త. **SOURCE:JVS మాష్టర్.**



**దత్త క్షేత్రము: 10:   మల్కాజిగిరి, సికింద్రాబాద్**

శ్రీ అవధూత బోధానందేంద్ర సరస్వతీ స్వామి వారు ప్రతిష్ఠించిన దత్త విగ్రహం, పాదుకలు.

1. వారు గాణగాపురం వెళ్ళినప్పుడు ఒక ఆగంతకుడు వచ్చి స్వామివారి విగ్రహం పాదుకలు చేతిలో పెట్టి వెళ్లిపోయారు.
2. ఇంకో చిత్రంలో ఉన్న శివలింగం మల్కాజిగిరిలో ఉన్న మల్లికార్జున గుట్ట/ అడ్డగుట్ట లో స్వామివారి ధ్యానం చేసుకునే ప్రదేశం ఒకరోజు ధ్యానావస్థలో ఉండగా గుర్తుతెలియని వ్యక్తి వచ్చి శివలింగమును వారి ఒడిలో పెట్టి వెళ్లిపోయారు.
3. కిరాతేశ్వరునిగా పూజలందుకుంటున్నాడు దేవదేవుడు.
4. అవధూత శ్రీ బోధానందేంద్ర సరస్వతీ స్వామి వారు.

**అడ్రస్:** మున్సిపల్ ఆఫీసు దగ్గర, Opp. గీతా భవన్.  మల్కాజిగిరి, సికింద్రాబాద్.: **SOURCE:హరికృష్ణ శర్మ.**








**దత్త క్షేత్రము: 11: ధర్మపురి**

తెలంగాణ రాష్ట్రం జగిత్యాల జిల్లాలో ధర్మపురి మండలం తీర్థక్షేత్రంగా విరాజిల్లుతున్నది. ఇక్కడ యోగ, ఉగ్రనారసింహ స్వామి ఆలయం చాలా ప్రసిద్ధి. ఇక్కడ * పూర్వకాలంలో దత్తాత్రేయ స్వామి గోదావరి నది ఒడ్డున తపమాచరించారు ఆ ప్రదేశంలో దత్తాత్రేయ స్వామి భక్తులేన "ద్యారం"వంశస్తులయిన * ద్యారం నర్సింహులు-రాజేశ్వరమ్మలకు దత్తాత్రేయ స్వామి వారిచే ప్రేరణ కలిగి వారు దత్తాత్రేయ మందిర నిర్మాణానికి పూనుకొన్నారు. వీరు ముంబయి నందు పురోహితులుగా జీవనం సాగిస్తున్నారు. దత్తాత్రేయ స్వామి అనుగ్రహం వలన వీరు తమ పారాయణ చేసిన భక్తుని కోరిక తీరి వీరికి దత్తాత్రేయ స్వామి విగ్రహం ఇవ్వడం జరిగింది. ద్యారం నరసింహులు దంపతులు ఆ విగ్రహాన్ని సుమారు 150 సంవత్సరాల క్రితం దత్తాత్రేయ స్వామి తపమాచరించిన ప్రదేశంలో ప్రతిష్ఠించి దేవాలయం నిర్మించారు. ఈ విధంగా ఆ దత్తాత్రేయ స్వామి పరోక్షంగా వారి గుడిని దత్త భక్తునిచే నిర్మించుకోవడం జరిగింది. ఇక్కడ ఎంతో మంది సిద్ధ పురుషులు తపమాచరిండం జరిగింది.గుండోబావు గారు మొదలుకొని శృంగేరిపీఠాధిపతులు "శ్రీ అభినవ విద్యాతీర్థ స్వామి, భారతీతీర్థ స్వాములు తపమాచరిండం జరిగింది దత్త నవరాత్రులలో ఋగ్వేద ,యజుర్వేద,సామ,అదర్వన వేదాలు, ఏకాదశ మహా రుద్రాభిషేకం తో పూజ జరుగుతుంది. దత్త పురాణం సంధ్య సమయంలో నిర్వహించడం జరుగుతుంది. స్వామి కోరిన వారికి కొంగు బంగారమై కోరికలు తీరుస్తున్నారు. "యదార్థంగా ఇక్కడ జరిగిన సంఘటన ":రోజు గుడిని* శుభ్రం చేసే వ్యక్తి ఔదుంబర వృక్షం ఏపుగా పెరిగిందని కొన్ని కొమ్మలు నరకగా ఆ రోజు ఆ వ్యక్తి జ్వర పీడితుడైనాడు. రాత్రి దత్త స్వాహా కలలో తెల్లని రంగు వస్త్రాలతో కనిపించి తన చేతులను నరకాలని ప్రయత్నిస్తే ఇలానే శిక్ష అనుభవిస్తావని చెప్పగా ఆ భక్తుడు తన తన తప్పును మన్నించమని కొబ్బరికాయ కొట్టి వేడుకోగా అతని జ్వరం తగ్గినది. **SOURCE- వినయ్ .S**



**దత్త క్షేత్రము: 12 : వరదవెల్లి**

అత్యంత అరుదైన రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడు – వరదవెల్లి దత్తాత్రేయుడు.

దత్తబంధువులందరి కీ నమస్కారములు,

దత్తాత్రేయుడు నిరాకారుడు. హద్దులు,ఎల్లలు లేనివాడు. శూన్యంలో కుడా వ్యాపించి ఉన్నవాడు. దిక్కులనే అంబరములుగా చేసుకున్నవాడు. కేవలం భక్తునుద్ధరించేందుకే రూపాలను ధరించేవాడు. నిరాకారంగా ఉండడం కుడా ఒక ఆకారమే అని చాటి చెప్పినవాడు. బాలకుడిగా వచ్చినా, ఉన్మత్తుడిగా ఉన్నా, కల్లుగీసే గౌడకులస్తుడిగా కనిపించినా, పిశాచరూపంలో ఉన్నా అవన్నీ భక్తులను ఉద్ధరించడానికే! అటువంటి దత్తాత్రేయుల వారు 'పడుకున్నపాములాగ' ఉన్నారన్న విషయం తెలిసి, ఆక్షేత్రాన్ని దర్శించి ఎంతో ఆనందించాను. నాకు కేవలం శ్రీపాదుల వారి ఆశీస్సులతో మాత్రమే ఈ క్షేత్ర సమాచారం లభించింది, వారి ఆశీస్సులతోనే నేనక్కడకి వెళ్ళడం జరిగింది మరియు తరువాత మన ట్రస్ట్ తరుపున ఒక 30 మందిని కుడా వారి ఆశీస్సులతోనే అక్కడికి తీసుకెళ్లడం జరిగింది. వరదవెల్లి దత్తాత్రేయుని విగ్రహంలో దాగున్న పెనవేసుకున్న జంట సర్పముల ఆనవాళ్ళను చూసి ఆశ్చర్యపోయాను. అబివృద్ధికి ఆమడదూరంలో ఉన్న ఒక కుగ్రామంలో, ప్రపంచంలోని ఏకైక రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడు నిఘూఢముగా ఉండడం మరింత ఆశ్చర్యపరిచింది. అక్కడి స్థలపురాణం తెలిసి ఆశ్చర్యపోవడం నావంతైంది. వెంటనే స్థానికులను, పూజారి గారిని కలిసి మన వెబ్సైట్ భక్తులందరి కోసం ఎంతో విలువైన సమాచారాన్ని సేకరించి మీకు అందిస్తున్నాను. గురు దత్తాత్రేయుల వారి ఆశీస్సులతో ప్రపంచం లోనే అతి కొద్దిమంది దత్త భక్తులకు మాత్రమే తెలిసిన ఈ వరదవెల్లి శయన దత్తాత్రేయుడిని దర్శించి తరించండి.
దిగంబరా..దిగంబరా..శ్రీ పాద వల్లభ దిగంబరా..దిగంబరా..దిగంబరా..
నరసింహ సరస్వతి దిగంబరా..అవధూత చింతన శ్రీ గురు దేవదత్త…

మీ-కీర్తి వల్లభ . వరదవెల్లి గ్రామం ఎక్కడుంది? ఆ పేరెలా వచ్చింది?...

వరదవెల్లి గ్రామం 'తెలంగాణ' లోని కరీంనగర్ జిల్లాలోగల బోయినపల్లి మండలంలో కరీంనగర్ – వేములవాడ రోడ్ లోని కొదురుపాక స్టేజి వద్దగలదు. వరదవెల్లి గ్రామం 'మిడ్ మానేరు' జలాశయం క్రింద రావడం వల్ల వరదవెల్లి గ్రామం మొత్తం దాదాపుగా నిర్వాసిత గ్రామమే. మిడ్ మానేరు జలాశయం పూర్తయితే ఈ అరుదైన దత్తక్షేత్రంతో పాటు ఊరు కుడా ఉండకపోవచ్చు. పూర్వం నుండి తరచుగా ఈ గ్రామం ముంపుకు, వరదలకు గురౌతుండడం, శ్రీరాం సాగర్ వరద కాల్వ ఈ గ్రామం గుండా వెళుతుండడం వల్ల 'వరదవెల్లి' అని పేరు వచ్చిందని కొంత మంది గ్రామస్తుల అభిప్రాయం. అయితే గురు

దత్తాత్రేయుల వారు 'వరద హస్తములతో' ఇక్కడ వెలియడం వల్ల 'వరదవెల్లి ' అనే పేరొచ్చిందన్నది చారిత్రాత్మక కథనం. వరదవెల్లి గ్రామం ను ఎలా చేరుకోవాలి? హైదరాబాద్ నుండి వరదవెల్లి గ్రామానికి రూట్ (సికింద్రాబాద్ To వరదవెల్లి 175 కీ.మీ.)

హైదరాబాద్ నుండి వరదవెల్లి గ్రామానికి రూట్ (సికింద్రాబాద్ TO వరదవెల్లి 175 కీ.మీ.) సికింద్రాబాద్ ---->JBS---->ఆల్వాల్ ---->షామీర్ పేట్ ----> ప్రజ్ఞాపూర్ ----> శనిగారం ----> కరీంనగర్ ----> వేములవాడ జంక్షన్ ----> వేములవాడ రోడ్ ----> బావ్ పేట్ గ్రానైట్ క్వారీలు ----> NTR TAMIL కాలనీ ----> వెంకట్రావు పేట ----> కొదురుపాక స్టేజ్ -----> వరదవెల్లి అడ్డ రోడ్ ---->వరదవెల్లి గ్రామం

వరదవెల్లి గ్రామం ప్రత్యేకత ఏంటి? అత్యంత అరుదైన రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడు ఉండడం ఈ గ్రామ ప్రత్యేకత. ఇటు వంటి క్షేత్రం ప్రపంచంలో మరెక్కడాలేదు. ఈ దత్తక్షేత్రం ప్రాంగణం లోనే దత్తాత్రేయుడు వేంకటేశ్వర స్వామి రూపంలో 'దత్త వేంకటేశ్వర స్వామి' గా కుడా వెలిశారు. దత్త వేంకటేశ్వర స్వామి గుడి అప్పట్లో గుట్ట మీదగల శయన దత్తాత్రేయుడు మరియు దత్త వేంకటేశ్వర స్వామిని దర్శించిన తర్వాతే వేములవాడ రాజరాజేశ్వర స్వామిని దర్శించేవారట. కాలక్రమేణా ఈ ఆచారం మరుగున పడిపోయింది. వరదవెల్లి రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయ స్థలపురాణం, వరదవెల్లి రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయ స్థలపురాణం తెలుసుకోవడం కోసం కొంత కష్టపడాల్సి వచ్చింది. కాని శ్రీపాదుల వారి దయతో,'హైందవ సంస్కృతి భరత్ కుమార్ శర్మ' గారి ద్వారా మరియు ఇతర దత్తావధూతల నుండి సేకరించిన సమాచారం ఒక చోట క్రోడీకరించి మీకిక్కడ వరదవెల్లి రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయ స్థలపురాణంగా ఇస్తున్నాను.

దాదాపు 900 సంవత్సరాల క్రితం దేశాటనలో భాగంగా శ్రీవేంకటాచార్యులు అనే ఒక కుర్ర వైష్ణవ అవధూత (ఈయననే వెంకావధూత అనేవారు) వేములవాడకు వచ్చి అక్కడనుండి వరదవెల్లికి వచ్చి అక్కడ గల గుట్ట మీద శ్రీ పద్మావతి వేంకటేశ్వర స్వామి వారి అనుగ్రంహం కోసం 12 సంవత్సరాలు తీవ్రమైన తపస్సు చేసారు. వెంకావధూత వేంకటేశ్వర స్వామి వారి భక్తుడే కాకుండా శ్రీ గురు దత్తాత్రేయుల వారి భక్తులు కుడా. వారి తపస్సుకు మెచ్చిన వేంకటేశ్వర స్వామి వెంకావధూత కోరిక మేరకు 'దత్తవెంకటేశ్వర స్వామిగా' దర్శనమిచ్చారు. దత్తవెంకటేశ్వర స్వామి దర్శనంతో పులకించిపోయిన వెంకావధూత తదుపరి కుడా అక్కడే ఉండి శ్రీ గురు దత్తాత్రేయుల వారి కోసం ఘోర తపస్సు చేసారు. ఆవిధంగా 28 సంవత్సరాలు దత్త దర్శనం కోసం నిరంతరం తపించారు. ఆఖరికి ఒకానొక గురువారం ఉదయం సూర్యోదయ సమయంలో శ్రీ దత్తాత్రేయుల వారు ఏఖముఖుడిగా ప్రత్యక్షమై వెంకావధూత

భక్తి శ్రద్ధలకు మెచ్చి ఏంకావాలో కోరుకోమన్నారు. ఈ సందర్భంగా శ్రీ గురు దత్తాత్రేయుల వారికి వెంకావధూత కు మధ్యలో జరిగిన సంభాషణ:

**శ్రీ దత్తాత్రేయుల వారు**: లోగడ నేను దత్తవెంకటేశ్వర స్వామిగా దర్శనం ఇచ్చినా ఇంకా పట్టువీడలేదేం? ఏదిఏమైనా నీ గురు భక్తి మాకు నచ్చింది… ఏంకావాలో కోరుకో వేంకటాచార్య!

**వెంకావధూత**: మహాప్రభో..దేవాదిదేవా…గురు సార్వభౌమా..”దయచేసి నన్ను మీలో ఐక్యం చేసుకోండి” అదే నా కోరిక.

**శ్రీ దత్తాత్రేయుల వారు**: నేను మహా సముద్రం వంటి వాడను. దానిలోకి ఒక కడవడు నీళ్ళు పోయడం వల్ల కడవడు నీరు వృధా అవుతుందే తప్ప ఉపయోగం లేదు. కాబట్టి నువ్వు నాలో ఐక్యం కావడం వల్ల నీకు నష్టమే తప్ప ఉపయోగం లేదు. బాగా ఆలోచించు. మరో కోరికేదైనా ఉంటే కోరుకోవచ్చు.

**వెంకావధూత**: క్షమించండి గురుదేవా నాకు ఆకోరిక తప్ప మరో కోరిక – ఆలోచన లేదు.

**శ్రీ దత్తాత్రేయుల వారు**: కాని నువ్విప్పుడే… ఈరోజు సూర్యోదయం నుండే ‘రాహు మహర్దశ’ లోకి వచ్చావు. రాహువు ఛాయాగ్రహం. మిగతా గ్రహాలూ నేరుగా ఖర్మ ఫలాలను అనుభవించేట్టుగా చేస్తే ఈ రాహుగ్రహం మాత్రం దొంగదెబ్బ తీసి ఖర్మ ఫలాలను అనుభవించేట్టుగా చేస్తాడు. నీ జన్మానుసారం నువ్వు రాహువిచ్చే భాదలకు లోనుకాక తప్పదు. అటుపిమ్మట మాత్రమే నేను నిన్ను ఐక్యం చేసుకోగలను.

**వెంకావధూత**: గురుదేవా నా జన్మకుండలి ప్రకారం ఇవ్వాళే నేను ‘రాహు మహర్దశ’ లోకి వచ్చాను. రాహువు నీచ సాంగత్యాన్ని ఇస్తాడు. అప్పుడు నేను మీలో ఐక్యం కావడానికి అర్హుడను కానేమో! అందుకే దయచేసి నన్ను మీలో ఐక్యం చేసుకోండి.

**శ్రీ దత్తాత్రేయుల వారు**: సరే అయితే నీ ఇష్టం…కాని రాహువు ఇచ్చే ఫలితాలను అనుభవించాకే అది సాధ్యం..కాబట్టి రాహువును పిలిపిద్దాం… రాహువుని రావలసిందిగా కాలభైరవుల ద్వారా కబురు పెడతారు.

అప్పుడు శ్రీ దత్తాత్రేయుల వారికి మరియు రాహువు కు మధ్య జరిగిన సంభాషణ:

**రాహువు**: గురుదేవా పాహిమాం..తమరి ఆజ్ఞ…

**శ్రీ దత్తాత్రేయుల వారు**: రాహు మహాశయా ఈ వెంకటాచార్యులు యొక్క ఖర్మలను అతి త్వరగా అనుభవించేట్టుగా చేసి పునీతుడను చెయ్యి.

**రాహువు:** గురుదేవా మీముందు నా శక్తి పనిచేయదు. ఇక్కడ నేను అశక్తుడను. మీ సమక్షంలో, సద్గురువుల సమక్షంలో నేను ఒక సాధారణ జీవిని మాత్రమే.

నా శక్తులన్నీ ఇప్పుడు మీలోనే నిక్షిప్త మై ఉన్నాయి. ప్రస్తుతం ఆ పని చేయగల సమర్థులు మీరే! క్షమించండి.

**శ్రీ దత్తాత్రేయుల వారు**: సరే అయితే నేనే రాహురూపం లోకి మారి. శయన సర్పరూపుడిగా ఆ పని చేస్తాను. నా త్రిమూర్త్యాత్మకతకు చిహ్నంగా ఈ క్షేత్రం లో మూడు నింబవృక్షాలు కుడా ఆవిర్భవించి, అరుదైన దత్తక్షేత్రంగా కీర్తికెక్కుతుంది. ఇక్కడకి దర్శనానికి వచ్చే భక్తులను రాహువు రూపంలో ఉన్న నేను త్వరగా ఉద్ధరిస్తాను. ఈ క్షేత్రం లో గల నా రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయ విగ్రహానికున్న 'వరద హస్తాలు'  భక్తులనెల్లవేళలా కాపాడతాయి.

**వెంకావధూత**: గురుదేవా శరణం శరణం.. ధన్యుడను.

అంతట శ్రీ దత్తాత్రేయుల వారు రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడు గా మారి వెంకావధూత ఖర్మలను త్వరగా అనుభవించేట్టుగా చేసి వెంకావధూతను వారిలోకి ఐక్యం చేసుకుంటారు. ఆ విధంగా కేవలం భక్తులను ఉద్ధరించడానికి మరో రూపం లోకి మారి అత్యంత అరుదైన రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడు – వరదవెల్లి దత్తాత్రేయుడు గా యేర్పడ్డాడు. ముందు చెప్పుకున్నట్లుగా రూపమే లేని గురు దత్తాత్రేయుడు ఇక్కడ చిత్రంగా ఉండి పూజలందుకుంటున్నారు. ప్రతి దత్త భక్తుడూ వెను వెంటనే దర్శించవలసిన క్షేత్రమిది.

వరదవెల్లి [రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడు] దత్త క్షేత్రం ఫోటోలు,వరదవెల్లి రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రే యుడిని ఎవరు దర్శించుకోవాలి ? ప్రపంచం లోనే అతి అరుదైన, వింతైన ఈ వరదవెల్లి రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడిని అందరూ దత్త భక్తులు దర్శించుకోవచ్చు. అలాగే ఈ క్రింది వారు మాత్రం తక్షణ ఉపశమనంకోసం తప్పక దర్శించుకోవాలి. వరదవెల్లి దత్తక్షేత్రాన్ని తక్షణ ఉపశమనం కోసం దర్శించుకోవలసినవారు ఆశ్చర్యపరిచే ప్రత్యక్ష నిదర్శనాలు

1. దత్తాత్రేయుడు పడుకుని రాహు రూపంలో ఉండడం
2. దత్తత్రేయునికి ప్రతీకగా నేటికి ఉన్న వందల ఏళ్ళనాటి నింబవృక్షాలు
3. వరదవెల్లి రాహురూప (సర్పరూప) శయన దత్తాత్రేయుడిని ఫోటో తీసినప్పుడు విగ్రహం లో దాగిఉన్న జంట సర్పాల ఆనవాళ్ళు కనిపించడం
4. దత్తాత్రేయుడు వెంకటేశ్వర స్వామి రూపంలో 'దత్త  వెంకటేశ్వరస్వామి' గా పిలవబడడం
5. ఇటువంటి అతి అరుదైన క్షేత్రం త్వరలో నదీగర్భంలో కలియనుండడం
6. క్షేత్రానికి 3 వైపులా నీరు ఉండడం



వరదవెల్లి సర్పరూప (రాహురూప) శయన దత్తాత్రేయుడు
Varadavelli Sarparupa (Rahu Rupa) Sayana Dattatreyudu



గురుదత్తాత్రేయ దేవాలయ ప్రాంగణం - వరదవెల్లి

## దత్త క్షేత్రము: 13: నృసింహసరస్వతి స్వామి క్షేత్రం - కొడువటూర్ దత్తాత్రేయ సిద్ధాశ్రమం

కొడువటూర్ (కొడవటూర్) సిద్ధులగుట్ట' ఒక సిద్ధక్షేత్రం. సిద్ధులు, గురువులు నడయాడిన పవిత్ర ఆధ్యాత్మిక కేంద్రం. ప్రముఖ దేవీ-దేవతా గణాలందరూ ఇక్కడ స్వయంభూగా వెలిశారు. కాకతీయుల కాలంలో ఒకవెలుగు వెలిగిన గొప్ప క్షేత్రమిది. ఈ క్షేత్ర గొప్పదనాన్ని గమనించిన శ్రీ గౌరీభట్ల రాధాకృష్ణశర్మ గారు ఇక్కడ 'ఘనస్వరూప శ్రీనృసింహసరస్వతి దత్తాత్రేయ సిద్ధాశ్రమం' స్థాపించారు. మనకు దగ్గరలో ఇంత పెద్ద శ్రీనృసింహసరస్వతి స్వామి వారి విగ్రహం ఇక్కడ తప్ప మరెక్కడా కనిపించదు. ఇక్కడ గల దత్తాత్రేయుడు తన పరివారంతో కొలువై నయన మనోహరంగా కనిపిస్తాడు. దత్త భక్తులందరూ తప్పనిసరిగా దర్శించి తరించ వలసిన క్షేత్రమిది. అలాగే ఈ గుట్ట పై ఒక ఒక ప్రసిద్ధ 'స్వయంభూ శ్రీ సిద్ధలింగేశ్వరస్వామి' శివాలయం కుడా ఉంది. అదేవిధంగా అనేక దేవాలయాలు ఈ గుట్టపై ఉన్నాయి.

ఎలా చేరుకోవాలి?

By Own Transport (80 KMs - 2 Hours Journey)

By Own Transport (80 KMs - 2 Hours Journey)

Uppal ----> Warangal Highway ----> Ghatkesar ----> Bibinagar ---->Warangal Highway Tole Plaza ----> Aler ----> Take Left Side Road (Railway Gate Road) At Aler ----> Kolanpak ----> Pochannapet ----> Bachhannapet ----> Koduvatoor

By Public Transport - (మొత్తం 90 KMs - 3 గంటల ప్రయాణం)

By Public Transport - (మొత్తం 90 KMs - 3 గంటల ప్రయాణం)

Hyderabad MGBS / Secunderabad Jubilee Bustand / Uppal ----> Aler ----> Bachhannapet (By Sharing Auto Riksha) ----> Koduvatoor

## కొడువటూర్ దత్తాత్రేయ సిద్ధాశ్రమక్షేత్ర దర్శనానికి అనువైన సమయం

కొడువటూర్ దత్తాత్రేయ సిద్ధాశ్రమ క్షేత్రం ఒక్కరోజులో దర్శించుకొని రావచ్చు. కొడువటూర్ దత్తాత్రేయ సిద్ధాశ్రమ క్షేత్ర దర్శనానికి అన్ని కాలాలు అనువైనవే. కాని అత్యంత అనువైన సమయం మాత్రం వానాకాలం. వానాకాలంలో సిద్దులగుట్ట అతిసుందరంగా ఉంటుంది. అలాగే శ్రీపాద శ్రీవల్లభ జయంతి రోజూ, గురుపౌర్ణమి రోజూ, శ్రీనృసింహసరస్వతి స్వామి జయంతి రోజూ మరియు దత్త జయంతి రోజు ఇక్కడ ఘనంగా ఉత్సవాలు జరుగుతాయి. ఆ సమయాల్లో దత్తాత్రేయ సిద్ధాశ్రమ దర్శనం చాలా బావుంటుంది.కొడువటూర్ దత్తాత్రేయ సిద్ధాశ్రమక్షేత్ర ప్రత్యేకత…

సిద్దులగుట్ట పై ఆశ్రమ స్థాపనచేయడం పెద్దదైన, సుందరమైన (ఘనస్వరూప) శ్రీనృసింహసరస్వతి స్వామి వారి విగ్రహం ఉండడం

దత్తాత్రేయ దేవాలయం పిట్టగోడలు ఓం ద్రాం, ఐం, హ్రీం, శ్రీం బీజాక్షరాలతో ఆవాహనం చేయడం శ్రీపాద శ్రీవల్లభ స్వామి వారి విగ్రహాన్ని ప్రతిష్టించడం

కొడువటూర్ సిద్దులగుట్ట క్షేత్రం లో చూడవలసిన ఇతర ఆలయాలు / ప్రదేశాలు

1. అతిపురాతన కాకతీయ ప్రతాపరుద్ర ప్రతిష్టిత ఈశాన్యాన శ్రీ ముక్కంటీశ్వరస్వామి దేవాలయం (ప్రస్తుతం శిధిలావస్థలో ఉంది.
2. KOLANPAK SWETHAMBER JAIN MANDIR కొలనుపాక జైన్ మందిర్: (జైన్ మందిరం లోకి హిందువులు దర్శనార్హులు)
3. PEMBARTHI (పెంబర్తి) METAL CRAFT MAKING VILLAGE (9 KMS FROM ALER)
4. KODAVATOOR - 33

## కొడువటూర్ దత్తాత్రేయ సిద్ధాశ్రమక్షేత్ర నిర్వాహకుల వివరాలు

SRI MUKESH SHARMA (KODUVATOOR DATTATREYA TEMPLE PUROHIT) PH: 9701662313, BY శ్రీ కీర్తి వల్లభ గారు.










**దత్త క్షేత్రము: 14:  బాసర  దత్తక్షేత్రం (శ్రీ నృసింహ సరస్వతి మహారాజ్ అనుష్ఠాన స్థలం)**

శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారు అనుష్ఠానం చేసుకున్న ప్రదేశం శ్రీ పాపహరేశ్వర మందిరం రోడ్డులో జ్ఞాన సరస్వతీదేవి దేవాలయము నుండి కేవలం 1.5 KMs దూరంలో గుట్ట మీద కలదు. ఇక్కడ శ్రీ గురుడు తపస్సు చేసుకున్న గుహ, సొరంగం మరియు అతి సుందర, పురాతనమైన దత్తాత్రేయ దేవాలయం ఉన్నాయి. బాసర్ యొక్క ప్రాముఖ్యతను గ్రహించిన రెండవ సంపూర్ణ దత్తావతారమైన శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారు తమ దేశాటనలో భాగంగా వాసర క్షేత్రానికొచ్చి, క్షేత్రంలో ఉండి అనుష్ఠానం చేసుకున్నారు. శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారు అనుష్ఠానం చేసుకున్న ప్రదేశం, వారు ఉన్న గుహ మరియు అప్పటి దత్తాత్రేయ మందిరం బాసర్ లో ఇప్పటికీ ఉన్నట్లు చాలామందికి తెలియదు.

ఇక్కడ గల దత్తాత్రేయ మందిరంలో ఉన్న దత్తాత్రేయుడు ఏకముఖంగా ఉండి, మిగిలిన ఇతర దత్తాత్రేయ విగ్రహాలతో పోల్చితే భిన్నంగా ఉంటాడు. శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారు ఇక్కడగల గుహ నుండి నేరుగా సొరంగమార్గం ద్వారా శ్రీ పాపహరేశ్వర మందిరాన్ని చేరుకునేవారట. ప్రస్తుతం ఆ సొరంగమార్గం మూసివేయబడినది. అలాగే శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారు ఇక్కడ నుండే శిష్యసమేతంగా కాలినడకన గోదావరి నదికి వెళ్ళేవారట. ఆ విధంగా వెళ్ళే నడకమార్గంలో బురదలో పడ్డ శ్రీ నృసింహ సరస్వతి స్వామి వారి పాద ముద్రలు దాదాపు 100 సంవత్సరాలపాటు ఉన్నాయట. ప్రస్తుతం ఇక్కడ దేవాలయ విశిష్టతను గురించి చెప్పే హోర్డింగ్ లను తెలుగు, ఇంగ్లీష్ , మరాఠి బాషలలో ఏర్పాటు చేసారు. దత్తభక్తులందరూ తప్పనిసరిగా చూసి తీరవలసిన దత్తక్షేత్రమిది. SOURCE:**కీర్తివల్లభ గారు**



Guru Dattatreya Swamy At Basar



Guru Dattatreya Tempe & Sri Nrusimha Saraswathi Swamy Anustana Sthal At Basar

## దత్త క్షేత్రము: 15: కోటి రుద్రమ్

శ్రీ నృసింహ సరస్వతి స్వామి స్వయంగా తెలిపిన, గురుచరిత్ర 15 వ అధ్యాయం లో దర్శించుకోమన్న క్షేత్రం ఇదే. ఇప్పుడు రుద్ర కోటి రుద్ర కోడూరు అని పిలవబడ్తుయూన్నది . ఇది అనాది క్షేత్రం శ్రీశైల క్షేత్రానికంటే ముందుగా ఉంది. పరమ శివుడు రుద్రకోటీశ్వరుడు గా పరాశక్తి రుద్రాణి దేవి గా పిలవబడుతున్నది. దేవి భాగవతం ప్రకారం 108 సిద్ధ పీఠాల్లో ఇది రుద్రాణి పీఠం ఈశ్వరుడు కోటి మంది ఋషులు కోటానుకోట్ల రుద్ర స్వరూపాల్లో సాక్షతరించిన ప్రదేశం దీని మహత్యం గురించి మత్య పురాణం

మహాభారతం విస్తారంగా వివరించాయి . కృతయుగములో 'లక్ష్మీ నారాయణులు'త్రేతా యుగం లో; సీత రాములు ',,ద్వాపరం లో, పాండవులు

కలి యుగం లో; ఆది శంకరాచార్యులు,వాదిరాజ తీర్థులు;రాఘవేంద్ర తీర్థులు;వీరబ్రహ్మేంద్ర స్వామి మొదలగు మహాత్ములు దర్శించుకున్నారు

గురు చరిత్ర లో 15 అధ్యాయంలో శ్రీ నరహరి నరసింహ సరస్వతి స్వామి వారి శిష్యులను తీర్థయాత్రలు చేయమని ఆదేశించిన్నపుడు కోటి రుద్రము అని ఈ క్షేత్రాన్ని కూడా ప్రస్తావించారు. ఈ క్షేత్రం బహు జాగృత క్షేత్రం

దట్టమైన అడవి లో పులులు , కొండ చిలువలు సంచరించే ప్రదేశంలో ఉంది కాబట్టి ఒక్క మహా శివ రాత్రి కార్తీక మాసం దేవి నవరాత్రుల సమయంలో వెళ్ళిరాగలము మిగితా సమయంలో వెళ్ళాలి అంటె అటవీశాఖ అనుమతి తప్పనిసరిగా తీసుకోవాలి. ఈ క్షేత్రానికి ఇప్పటికి ఒక రాజ నాగము కాపలాగా ఉంది . పౌర్ణమి సమయంలో బ్రహ్మీ ముహూర్తం లో రుద్రకోటీశ్వరుడు జ్యోతి గా దర్శనమిస్తాడు చూసిన వాళ్ళు ఇప్పటి ఉన్నారు. ఎంతటి మహామహిమాన్విత క్షేత్రం శ్రీశైలం పరివాహ క్షేత్రాల్లో ఒక్కటి చేరుకునే మార్గము కర్నూలు జిల్లా ఆత్మకూరు నుండి నంద్యాల వెళ్లే దారిలో నల్లకాలువ అనే చిన్న పల్లెటూరు వద్ద దిగి 15కిమి లు అటవీ మార్గం లో ప్రయాణించి చేరుకోవచ్చు.

**గమనిక :** మహా శివరాత్రి;కార్తీక సోమవరాలు తప్ప మిగితా సమయంలో ఎటువంటి బస్సు వసతి ఉండదు లేదు. మాములు రోజుల్లో పోవాలంటే దారి తెలిసిన వారు తోడుగా తీసుకొనివెళ్ళాలి. **BY మణి దీప్.**

## దత్త క్షేత్రము: 16: దత్తాలయగుట్ట

రెండవ దత్తావతారమైన శ్రీ నరసింహ సరస్వతి స్వామి వారి గురించిన రహస్య సమాచారమేదైనా ఉంటే తెలపమని శ్రీపాద శ్రీ వల్లభుల వారిని నేను తరచూ నా మనసు లోనే అడిగే వాడిని. ఒక రోజు నాకు ప్రముఖ శ్రీపాద శ్రీ వల్లభ భక్తులైన శ్రీ మల్లాది వెంకట భాస్కర రావు గారి (న్యూ ఢిల్లీ) దగ్గర నుండి స్పీడ్ పోస్ట్ లో ఒక పార్సిల్ వచ్చింది. ఆ పార్సిల్ ఇవ్వడానికి వచ్చినతను నాదగ్గర సంతకం తీసుకుంటుంటే నా మొబైల్ ఫోన్ మోగింది నా మొబైల్ ఫోన్ కు నేను రింగ్ టోన్ గా "దిగంబరా..దిగంబరా..శ్రీ పాద వల్లభ దిగంబరా..దిగంబరా..దిగంబరా.. నరసింహ సరస్వతి దిగంబరా.." అనే ట్యూన్ సెట్ చేసుకున్నాను. అది విన్న అతను "ఈ నరసింహ సరస్వతి ఎవరు? మా జోగిపేట దగ్గర 'ఒక గుట్ట' లో కుడా ఇదే పేరుని విన్నాను" అని చెప్పాడు. నేను నరసింహ సరస్వతి స్వామీ వారి గురించి చెప్పి అతని దగ్గర ఉన్న అస్పష్టమైన సమాచారాన్ని, అడ్రస్ ను తీసుకోని మొత్తానికి అతను చెప్పిన గుట్ట చేరాను. అక్కడికి వెళ్ళిన తరువాత తెలిసింది అది ఒక అతి రహస్యమైన దత్తక్షేత్రమనీ , శ్రీపాదుడు తన పాద స్పర్శతో పునీతం చేసిన ప్రదేశమనీ, నరసింహ సరస్వతి స్వామివారు 12 సంవత్సరాలు రహస్యంగా తపస్సు చేసిన ప్రాంతమనీ, గురుచరిత్ర వ్రాసిన నామధారకుడు తన అంత్యకాలంలో ఇక్కడే గడిపాడని తెలుసుకొని ఆశ్చర్యపోయాను. అక్కడ ఉండే దత్తాత్రేయుని రూపం చూసి మరింతగా ఆశ్చర్యపోయాను. వెంటనే స్థానికులను, పూజారి గారిని కలిసి భక్తులందరి కోసం ఎంతో విలువైన సమాచారాన్ని సేకరించి మీకు అందిస్తున్నాను. ఆస్వాదించండి. దిగంబరా..దిగంబరా..శ్రీ పాద వల్లభ దిగంబరా..దిగంబరా..దిగంబరా.. నరసింహ సరస్వతి దిగంబరా..

**ROUTE:**

Balanagar----> Jeedimetla----> Gandi Maisamma X Roads ----> ORR ----> Narsapur Road---->Dundigal----> Gummadidala---->Nallapalli Forest Belt---->Narsapur----> Left Side Road At Narsapur Ambedkar Statue---->Doulatabad Road -----> Doulatabad-----> Right Side Road At Doulatabad 'Y' Junction---->Hatnura Road----> Hatnura---->Konyaal Road---->Maadhira Village -----> Dattachalam (Dattalaya Gutta)

దత్తాచలక్షేత్రం (దత్తాలయగుట్ట) ప్రత్యేకత ఏంటి? ఏక పాద దత్తక్షేత్రం

శ్రీపాద శ్రీ వల్లభులు తమ 16వ ఏటా పిఠాపురంలో సన్యాస దీక్ష తీసుకోని, ఇంటినుండి బయలుదేరి ఉత్తరదేశ ముఖంగా వెళ్లి అనేక క్షేత్రాలను దర్శించి తరువాత గోకర్ణం చేరి అక్కడ 3 సంవత్సరాలకాలముండి, దత్తాచలం చేరి అక్కడి గుహలలో గల మహాసిద్ధులను ఆశీర్వదించి, దగ్గరలో గల మంజీరా నదిలో స్నానమాచరించి, దత్తాచలక్షేత్రం మీదుగా శ్రీశైలం చేరారని ఇక్కడి స్థల పురాణం. నరసింహ సరస్వతి స్వామివారు 12 సంవత్సరాలు రహస్యంగా తపస్సు చేసిన ప్రదేశమిది. నరసింహ సరస్వతి స్వామి వారి ముఖ్య శిష్యుడు మరియు గురుచరిత్ర వ్రాసిన నామధారకుడు తన అంత్యకాలం మొత్తం ఇక్కడే గడపడం విశేషం. మంజీరానది కి (సుమారు 8 కీ.మీ. దూరంలో) సమీపం లో గల దత్తక్షేత్రం. దత్తాలయగుట్టకు సమీపంలోనే అన్ని విధాలా కాశీ విశ్వేశ్వరుడిని పోలిఉన్న కాశీపతి దేవాలయం కలదు. ఈ గుడి వద్దనే శ్రీగురుని ఏక పాదముద్ర గలదు. శ్రీచక్రాన్ని కలిగి ఉన్న ఏకైక దత్తాత్రేయుడు

ఇక్కడ శ్రీచక్ర సహిత దత్తాత్రేయుడు కొలువుతీరి ఉండడం వల్ల ఈక్షేత్రం “మహిళా దత్తక్షేత్రం” గా వెలుగుతోంది (ఇక్కడి గుడి నిర్మాణ కార్యక్రమమును ప్రారంబించింది కుడా ఒక మహిళా మంత్రే!)

ఇక్కడ న్యాయబద్ధమైన కోరిక కోరిన మహిళలు, అవి తీరకుండా నిరాశ పొందిన మహిళ ఒక్కరు కుడా లేరట. ఇక్కడ కొలువుతీరిన దత్తుడి రూపం మనం ఊహించనిదిగా, ముందెప్పుడూ చూడని విధంగా ఉంటుంది.

**దత్తాచలక్షేత్ర (దత్తాలయగుట్ట) స్థలపురాణం:**

రెండవ దత్తావతారమైన శ్రీ నరసింహ సరస్వతి స్వామి వారు గాణ్గాపురము నందు ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకొని వారి వద్ద గల శిష్యులకు సనాతన ధర్మములను ఉపదేశించేవారు. వారి శిష్యగణంలో అతి ముఖ్యమైనవారు శ్రీ నామాధారకులు. నామధారాకుల వారు గురు ఆశీర్వాదం మెండుగా కలిగినవారు, మరియు గృహస్తు కుడా. వారు అనేక వేదములను అధ్యయనం చేసి, శ్రీ నరసింహ సరస్వతి స్వామి వారి సేవలో గడిపి శ్రీగురుని (శ్రీ నరసింహ సరస్వతి స్వామి వారు) వద్ద నుండి అనేక గురుసేవా రహస్యాలను తెలుసుకున్న దత్తదైవాంశ సంభూతులు. అలాగే గురు చరిత్రను మనకి అక్షర రూపంలో అందించినది కుడా ఈయనే. ఇటువంటి స్థితిలో గల నామధారాకుల వారు శ్రీగురుని విడిచి క్షణమైనా ఉండలేకపోయేవారు. ఒకానొక సమయంలో శ్రీగురుడు (శ్రీ నరసింహ సరస్వతి స్వామి వారు) 12 సంవత్సరాల పాటు గాణ్గాపురమును విడిచి తపస్సు చేసుకొనుటకు వేరే ప్రాంతానికి వెళతారు. ఆ ‘గురు ఎడబాటు’ తట్టుకోలేని నామధారకుడు గురువు గారి జాడ కోసం అనేక ప్రయత్నా చేసి ఆఖరుకు శ్రీగురుడు దత్తాచలక్షేత్రం లో తపస్సు చేసుకొంటున్నట్లుగా తెలుసుకుంటారు. ఆ తరువాత ఒకానొక మాఘ బహుళ

పాడ్యమి రోజు శ్రీగురుడు నిర్ధారితం చెందినట్లుగా తెలుసుకొని ఎంతో దుఃఖించి, విరక్తి చెంది, ముందు లాగే మళ్లీ ఎలాగైనా దత్తాచలక్షేత్రం లో కనబడవచ్చనే నమ్మకంతో దత్తాచలం వచ్చి శ్రీగురుని కోసం ఘోరంగా తపస్సు చేస్తారు. నామధారాకుల వారి అచంచల గురు భక్తికి మెచ్చి శ్రీచక్ర సమేతంగా శ్రీదత్తాత్రేయుల వారు ప్రత్యక్షమై, వెంటనే శ్రీ నరసింహ సరస్వతి స్వామి వారిగా దర్శనమిచ్చి జనన-మరణ-వైరాగ్య బోధనలను ఉపదేశించి, వారి పాదుకలను (నిర్గుణ పాదుకలు – ప్రస్తుతం మనం చూసే నిర్గుణ పాదుకలు అవే) శ్రీ నామధారాకులవారికిచ్చి, వాటిని గాణ్గాపుర ఆశ్రమంలో ప్రతిష్ఠించి నిత్యపూజలు చేస్తూ సనాతనధర్మములను భక్తులకు భోదించమని చెప్పి అంతర్ధానమవుతారు. అంతట శ్రీగురుని ఆదేశానుసారం శ్రీ నామదారకులు శ్రీగురుని పాదుకలను ప్రతిష్ఠించి సనాతనధర్మప్రచారం చేస్తూ కాలం గడుపుతారు. శ్రీ నామదారకులు వృద్ధాప్యం లోకి వచ్చిన తరువాత మళ్లీ శ్రీగురుని వెతుక్కుంటూ దత్తాచలం చేరి దత్తాచలగుట్ట వద్ద గల దత్తకొలను లో నీటి మీద కుర్చుని అన్న, పానీయాలు మాని శ్రీగురుని దర్శనభాగ్యం కోసం తపోనిష్టలో ఉండేవారు.

దాదాపుగా అదే సమయంలో ఆ ప్రాంతాన్ని పాలించే నవాబ్ (రాజు – King) గారి ఒక్కగానొక్క కూతురికి రాచపుండు (Cancer) వ్యాధి వస్తుంది. అప్పుడు ఆ నవాబ్ గారు కూతురుని బతికించమని అనేక మంది వైద్యులను కలుస్తారు. అందరు వైద్యులు కుడా ఈ జబ్బు తగ్గదని, త్వరలోనే మరణం తధ్యమని చెపుతారు. అయినప్పటికీ నవాబ్ గారు ఏదైనా ఉపాయం చెప్పమని వైద్యులని వేడుకుంటాడు. ఆ వైద్యులలో ఒక వైద్యుడు " మీ కూతురు మరణించకుండా ఆపలేము కాని ఆ మరణాన్ని వాయిదా వేయుటకు ఒక సలహాగలదు" అని చెపుతాడు. అంతట ఆ నవాబ్ గారు ఆ సలహా ఏమిటో చెప్పమని వేడుకొనగా "మీ కూతురిని నగర కాలుష్యం నుండి దూరంగా అడవికి తీసుకుని వెళ్లి అక్కడ లభించే సహజ ఫలాలు, తెనేవంటివి ఇస్తే మరొక రెండు నెలలు బ్రతకవచ్చు" అని సలహా ఇస్తాడావైద్యుడు.

వెంటనే నవాబ్ గారు రాజ్యాన్ని వారి తమ్ముడికి అప్పజెప్పి కొంత మంది పని వారిని తీసుకోని కూతురితో సహా దట్టమైన అడవులలోకి వెళతారు. పనివారు ఆహార సేకరణ లో భాగంగా దత్తాచలగుట్ట దగ్గరకు వస్తారు. అక్కడ గల కొలనులో నీటి మీద కుర్చుని తపోనిష్ట లో ఉన్న శ్రీ నామదారకుడిని చూసి, ఆశ్చర్యపోయి ఆ సమాచారాన్ని నవాబ్ గారికి అందిస్తారు. అప్పుడు ఆ నవాబ్ గారు నీటి మీద కుర్చుని తపోనిష్ట లో ఉన్న శ్రీ నామదారకుడిని చూసి, ఆయన వద్దకు వెళ్ళాలా? వద్దా? పైగా ఆయన హిందూ మతస్తుడు, నేనేమో మహామ్మదియుడిని అని ఆలోచిస్తారు, ఈయన ఎలాగైనా నా కూతురుని

రక్షించగలరని మనసులో అనుకోని శ్రీ నామదారకుడి వద్దకు వెళతారు, తమ కూతురిని రాచపుండు (Cancer) వ్యాధి నుండి రక్షించమని వేడుకుంటారు. దానికి సమాధానంగా శ్రీ నామదారకుడు “అయ్యా రాజు గారు, నేను ఒక సాధారణ బ్రాహ్మణుడను. నావద్ద ఎలాంటి మంత్ర విద్యలు కాని, వైద్య విద్యలు కాని, సంజీవిని కాని లేదు. జీవితం పై విరక్తి చెంది, పెళ్ళాం బిడ్డలను వదిలి సన్యశిస్తున్న సాధారణ సన్యాసిని నేను, తపోభంగం కలిగించవద్దు దయచేసి వెళ్ళిపోండి” అని చెబుతారు.

**BY KEERTHI VALLABHA** (keerthivallabha@gmail.com)




**దత్త క్షేత్రము: 17:** శ్రీశైల దేవస్థానం

శ్రీశైల దేవస్థానం లో త్రిఫల వృక్షం(రావి,జివ్వి,మేడి)చెట్లు కలిసి ఉన్నాయి.దీనిని ఆగస్య మహర్షి రూపంగా తలుస్తారు.ఈ చెట్టు కింద ఇప్పుడు దత్తాత్రేయ చిన్న గుడి ఉంది.ఇక్కడ దత్తాత్రేయ స్వామి తపస్సు చేశారు.జై గురు దత్త. **SOURCE-మణదీప్.**



**దత్త క్షేత్రము: 18: మంథని(మంత్ర పురి)**

సుమారు 100 సంవత్సరాల క్రితం దోమల రాధమ్మ అనే యోగిని ఈ ప్రాంతంలో ఉండేవారు.ఆమె దత్తాత్రేయ భక్తురాలు.చాలా మందికి దత్తాత్రేయ మార్గం బోధించి వారిని దత్తాత్రేయ బిడ్డలు గా మార్చారు.అప్పటి నిజాం మంత్రి గారు దత్త భక్తులై అక్కడ దత్తత్రేయ మందిరం కట్టడానికి సహకరించారు.అప్పటి నుంచి ఇప్పటికి భోధనంద్రేంద్ర సరస్వతి స్వామి విరచిత దత్తాత్రేయ గురు చరిత్ర సప్తహ పారాయణ,భజనలు,కీర్తనలను పాడుతుంటారు.గోదావరి వడ్డున ఈ గ్రామంలో శ్రీ వాసుదే నంద సరస్వతి స్వామి అనేక లీలలు చేశారు.అక్కడ అవధానుల ఇళ్ళ లో నిత్య జల భిక్ష, అగ్ని హెూత్రంకు స్వామి ఉదయం హాజరు అయి, అక్కడికి 60 km దూరంలో ఉన్న కాళేశ్వర మందిరం కు ఆకాశ మార్గంలో ఒక గంటలో లో చేరుకునే వారుట.అనేక పురాతన మందిరాలు ఉన్నాయి.శ్రీ గౌతమ మహర్షి స్థాపిత శివాలయం( గౌతమేశ్వరుడు ) కూడా ఉంది. దత్తాత్రేయ మందిరంలో దత్త జయంతి కి దత్త నవరాత్రులు జరుగుతాయి.

**రూట్ మాప్:** ట్రైన్లో రామగుండం వచ్చి అక్కడికి 30 km దూరంలో వున్న మంథని కి బస్ లో చేరుకోవచ్చు.గోదావరి ఖని 25 km మంథని కి పెద్దపల్లి జిల్లా,మంథని తాలూకా,మంతెని . **SOURCE రమేష్ సోమ**





.

**దత్త క్షేత్రము: 19: ముక్త్యాల**

ఇది జగ్గయ్య పేట కు 10 km దూరం లో ఉంది.శ్రీ వాసుదేవనంద సరస్వతి స్వామి ఈ గ్రామం లో ఆధ్యాత్మిక శ్రద్ధ కు చూసి మృద్ధులై ఇక్కడ కోటి లింగాల రేవు లోని శివాలయం లో 4 నెలలు చతుర్మాస్యం చేసిన పవిత్ర ప్రాంతం.ఇక్కడ వారికి కొద్దిగా విశ్రాంతి దొరకడం తో ఇక్కడే యోగ శిక్ష,వృద్ధా శిక్ష,స్త్రీ శిక్ష అనే గ్రంధాలు రచించారు. శక సంవత్సరం 1830 లో వ్యాస పూజ చేసి చతుర్మాస్యం ప్రారంభించారు. రోజు సాయంత్రం పూజ ఆలయ మండపంలో ధర్మం మీద ఉపన్యాసాలు చెప్పేవారు.

**రూట్ మాప్**: ఖమ్మం నుంచి జగ్గయ్యపేట, అక్కడ నుంచి సుమారు 10 km దూరం లో ఉన్న ముక్త్యాల గ్రామనికి వెళ్ళవచ్చు.స్వామి వారి జయంతి, ఆరాధన జరుగుతాయి. జై గురు దేవ దత్త.



**దత్త క్షేత్రము: 20:**

**శ్రీపాద రాజం శరణం ప్రపద్యే..దిగంబరా..దిగంబరా..శ్రీపాద వల్లభ దిగంబరా..శ్రీసంస్కారహీన శివస్వరూప దత్తాత్రేయ మహారాజ్ కీ జై..**

Telangana రాష్ట్రంలో (నిజాం కాలం కంటే ముందు) అనేకానేక Datta Kshetra లు ఉండేవనీ, వాటిలో కొన్ని ధ్వంసము చేయబడగా మరికొన్ని అశ్రద్ధ చేయబడ్డాయనీ మీకు ఇదివరకే తెలియజేయడం జరిగింది. ఆవిధంగా అశ్రద్ధ చేయబడిన ఒకానొక గొప్పదైన, అతిఅరుదైన, షోడశ దత్తావతారములలో 13వ అవతారమైన 'శ్రీసంస్కారహీన శివస్వరూప దత్తాత్రేయ దేవాలయం' గురించిన సమాచారాన్ని ప్రముఖ దత్తభక్తులు శ్రీ రమేష్ గారు నాకు చేరవేశారు. ఆ సమాచారాన్ని అందుకున్న నేను Palamakula అనే Village కి వెళ్లి అక్కడ అత్యంత హీన, దీన స్థితిలో ఉన్న 'సంస్కారహీన శివస్వరూప దత్తాత్రే యుడు ' ఉన్న ప్రదేశానికి వెళ్లి, అక్కడి పరిస్థితులను చూసి చాల బాధపడ్డాను.

సంస్కారహీన శివస్వరూప దత్తాత్రేయస్వామి వారి స్థల పురాణం సేకరించడానికి నాకు అధిక సమయం మరియు ప్రయాసలు కలిగినప్పటికీ RajagopalPet అనే Village లో ఉండే శ్రీ దస్తగిరి అనబడే వారినుండీ, అలాగే ఆటోరిక్షా నడిపే శ్రీ ఆంజనేయులు గారి (Mob No.9676683805 ) సహకారంతో సంస్కారహీన శివస్వరూప దత్తాత్రేయ క్షేత్రం యొక్క ప్రాముఖ్యత తెలుసుకున్నాను. ఈ క్షేత్రం యొక్క అతి ప్రాముఖ్యమైన విషయమేమిటంటే ఇక్కడ దత్తస్వామి గణపతి మరియు పార్వతి అమ్మలతో ఒకే పీఠంపై కొలువై ఉన్నాడు.

ఒకప్పుడు అంగరంగ వైభవంగా వెలుగొందిన గొప్ప దత్త క్షేత్రం నేడు చెత్తను Dump చేసే Dumping Yard లా మారిపోయింది. రాత్రయితే ఆ ప్రదేశం అరాచకాలకూ, అక్రమాలకూ అడ్డా. ముంతల్లో, సీసాల్లో మద్యం తెచ్చుకుని హాయిగా కూర్చుని తాగడానికి అనుకూల ప్రదేశం. ఈక్షేత్రాన్ని చూస్తే 'కని రోడ్డుమీద పారేసిన అమాయకపు బిడ్డ' లాగ స్వచ్ఛంగా ఉంటుంది. ప్రస్తుతం Palamakula Village లో పరిస్థితి ఏంటంటే 'శివస్వరూప దత్తాత్రేయస్వామి గుడి' అంటే ఎవరికీ తెలియదు. కానీ "బండ మీది శివుని గుడి" అని అడిగితే ఏకొద్ది మందో గుర్తుపట్టి Address చెప్పవచ్చు.

ఇక్కడ స్వామి వారికి రోజువారీ నైవేద్యం సంగతి దేవుడెరుగు కనీసం దీపం పెట్టే దిక్కేలేదు. అన్నివేళలా గుడి తలుపులు తెరిచే ఉంటాయి. శివస్వరూప దత్తాత్రేయస్వామి గుడికి దగ్గరలోనే దాదాపు 2 ఫర్లాంగుల దూరంలో ఒక అమ్మవారి గుడి ఉంది. ఆ గుడిని చూసుకోవడానికి ఒక పూజారితో పాటుగా చక్కగా చుట్టూరా ప్రహరీ గోడతో ధూప, దీప,నై వేద్యాలతో అలరాలుతోంది. నేనువెళ్ళిన సమయానికి శివస్వరూప దత్తాత్రేయస్వామి గుడి అత్యంత దుర్భరమైన స్థితిలో ఉంది. వెంటనే గుడిని శుభ్రంగాచేసి దగ్గరలోని అమ్మవారి గుడి నుండి నీళ్లను తెచ్చి సంస్కారహీన శివస్వరూప దత్తాత్రేయునకు, నంది సహిత శివలింగానికి అభిషేకం చేసి, అక్కడే అదేసమయంలో పూసిన కాషాయరంగు మోదుగ (Flame of The Forest) పూలనూ, ఒక కాషాయ వస్త్రాన్ని సమర్పించడం జరిగింది. ఈ క్షేత్రానికి దగ్గరలో అనేక ఇతర దత్తక్షేత్రాలు కూడా కలవు. వాటిలో RAMPUR అనే VILLAGE లో SRIPADA SRI VALLABHA DATTA KSHETRAM కలదు. అదేవిధంగా VELKATUR అనే VILLAGE లో 12వ దత్తావతారమైన SRI RAMLAL PRABHI JI వారి TRUST ఒకటి కలదు, అలాగే ఇక్కడకి దగ్గరలోనే గల MARRIMUTYALA అనే VILLAGE లో SRI SAANDRANANDA SWAMY ASHARAMAM మరియు DATTATREYA TEMPLE, PADUKA & OUDUMBARAM కూడా తప్పక దర్శింపదగినవి.



**దత్త క్షేత్రము: 21:**

శ్రీశివదత్తేశ్వర దత్తమహారాజ్

Telangana రాష్ట్రంలో (నిజాం కాలం కంటే ముందు) వందలకొలది Datta Kshetraలుఉండేవి. ప్రస్తుతం వాటి సంఖ్య పదులకు చేరుకుంది. ముందు ముందు ఆ ఉన్నవి కూడా కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. మన తరువాతి తరముల వారికి ప్రాచీన Datta kshetraదర్శన భాగ్యం కూడా దుర్లభం అయ్యే పరిస్థితి. ప్రాచీన దత్త దేవాలయాలను పునరుద్ధరించడం అటుంచితే ఉన్న దత్త దేవాలయాలను కూడా కాపాడుకోలేని దుస్థితి. కళ్ళ ముందు Kadalivanam లో విగ్రహాలు పగలగొట్టినా కనీసం Respond అయ్యే పరిస్థితులలో మనము లేము. పురాతన దత్త క్షేత్రమే శివదత్తేశ్వర దత్త క్షేత్రం. గ్రామంలోని యాదవ కులస్థులందరూ తలా కొంచెం ధనరూపేణా, శ్రమరూపేణా, సమయంరూపేణా వెచ్చించి త్వరలోనే కనుమరుగవ్వాల్సిన గొప్ప దత్త క్షేత్రాన్ని తిరిగి నిలిపారు. అందరికీ ఆదర్శంగా నిలిచారు. అందరికీ తెలియని,పెద్దగా ప్రాచుర్యంలోకిరాని, ఉద్ధమర్రి అనే కుగ్రామం లో ఉన్న పవిత్రమైన ఈ శివదత్తేశ్వర దత్తక్షేత్రాన్ని దత్తభక్తులందరూ తప్పక దర్శించి, తరిస్తారని ఆశిస్తూ ... జై గురుదత్త- Keerthi Vallabha (keerthivallabha@gmail.com)

1515-1545 మధ్యకాలంలో 'అవధూత రాయుడు' అనే ఒక గప్ప దత్త ఉపాశకులు ఇక్కడ దత్తాత్రేయుని గుడి కట్టించినట్లుగా తెలియవచ్చింది. ఈ క్షేత్రంలో దత్తాత్రేయ విగ్రహం ఎదురుగా నంది సహిత శివలింగం ఉంటుంది. అందువల్లనే ఈ దేవాలయం 'శివదత్తేశ్వర దత్త దేవాలయం' గా పేరు వచ్చింది. ఇచ్చట అవధూత రాయుడు ప్రతిష్టించిన దత్తాత్రేయ విగ్రహాన్ని ఎవరో దొంగిలించగా నూతనంగా త్రిముఖ దత్తాత్రేయుల వారిని ప్రతిష్టించారు. శివలింగం మాత్రం అప్పటిదేనని (ఆకాలం నాటిదేనని) గ్రామస్థులు చెప్పారు.

ఈ దేవాలయం మల్లన్న దేవాలయం దగ్గర ఉంటుంది. క్రీ.శ. 1545 తదుపరి (ఆధూత రాయుడు నిర్యాణం అనంతరం) ఈ క్షేత్రం బాగోగులు చూసే వారు లేక పాడు పడిపోయింది. పురాతన దత్త విగ్రహంతో పాటు విమానగోపురం పైన ఉన్న కలశాలు సైతం తస్కరించబడ్డాయి. తదుపరి Uddamarri గ్రామం స్మశానం కూడా కాలక్రమేణా ఈ గుడి వరుకు విస్తరించింది. స్మశానానికీ మల్లన్నగుడి, దత్తాత్రేయ గుళ్లకు మధ్యలో ఎటువంటి సరిహద్దు గోడ (Compound Wall) కూడా లేకుండా అన్ని కలిసే ఉంటాయి. ఫలితంగా భక్తులు గుడివైపు రావడం మానేశారు. ఫలితంగా గొప్ప దత్తక్షేత్రం కాలగర్భంలో కలిసిపోయింది.. ఈ క్షేత్రానికి అతి దగ్గరలో యాదవ కులస్థుల కులదైవమైన 'మల్లన్నగుడి' ఉంది. మల్లన్నగుడికి వెళ్లి వస్తూ ఉండే యాదవులు దత్తాత్రేయ దేవాలయం గురించి ఆలోచించి ఎలాగైనా గుడిని పునరుద్ధరించాలని సంకల్పించి తలా

కొంత చొప్పున చందాలను ప్రోగుచేసి దత్తాత్రేయుని గుడిని బాగుచేయించి, తిరిగి దత్తాత్రేయుడిని ప్రతిష్ఠించి అక్కడ బాగోగులను చూడడం కోసం వేరేవాళ్లను నియమించారు. ఈ క్షేత్రంలో అతి పవిత్రమైన, అతి మహిమ గల ఒక మూలస్థంభం ఉంది. దానిచుట్టు ప్రదక్షిణలు చేస్తే ఎటువంటి ఆపదలైనా తీరుతాయని ఇక్కడి వారి నమ్మకం. అలాగే ఇక్కడ ఒక కోనేరు కూడా కలదు.ఈ కోనేరులో గల జలచరాలకు ఆహారం వెయ్యడం వల్ల శత్రుబాధలు తొలిగిపోతాయని భక్తుల నమ్మకం.

ఇప్పుడు ఈ క్షేత్రం లోని శివదత్తేశ్వర దత్తాత్రేయుల వారు Uddamarri, MuduchinthalaPalli మరియు ఇతర చుట్టుప్రక్కల గ్రామాలలోని యాదవ కులస్థులకు ఇలవేల్పైపూజలను అందుకుంటున్నాడు. ప్రస్తుతం ఇక్కడ దత్తాత్రేయుల వారికి సంభందించిన అన్ని పర్వదినాలు(దత్త జయంతి, గురుపూర్ణిమ మొదలైనవి) జరుపుకుంటున్నట్లుగా తెలియవచ్చింది







## దత్త క్షేత్రము: 22: శ్రీ బ్రహ్మానంద సరస్వతి మఠం

దాదాపు రాజమండ్రిలో ప్రతిష్ఠ చేసిన శ్రీ భక్తవత్సలుడు లాంటి సంతానం ప్రసాదించే శ్రీ దత్తాత్రేయ విగ్రహం శ్రీ వాసుదేవనంద సరస్వతి స్వామి వారు బ్రహ్మానంద సరస్వతి మఠం లో ప్రతిష్ఠ చేశారు.ఇప్పుడు శ్రీ కుర్తాళం వాళ్ళ అధీనం లో ఉంది.స్టోన్ పేట లో ఈ మఠం సదానంద వారి వేద పాఠశాల కు దగ్గరగా ఉంది. **SOURCE-V. సత్య కుమార్ గారు.**



**దత్త క్షేత్రము: 23: పిఠాపురం**

శ్రీ పాద శ్రీ వల్లభ చరితామృతం లో శ్రీపాద శ్రీ చరణుల వారు అనేక చోట్ల చెప్పినట్లు గా వారి మహా సంస్థానం ఏర్పడినది. పిఠాపురంలో శ్రీపాద శ్రీ వల్లభ భక్తులందరూ దర్శింపదగ్గ దివ్య ప్రదేశం "శ్రీపాద శ్రీ వల్లభ మహా సంస్థానం" . ఇది పెద్ద బజారు సమీపం లో, వేణుగోపాల స్వామి వారి గుడి వీధిలొ గలదు. ఇచ్చటనే శ్రీపాద శ్రీ వల్లభుల వారి పాదుకలు ప్రతిష్టించబడినవి. ఇచ్చట గల పాదుకల దర్శనం మనలోని అణువణువును గురుభక్తి తో నింపుతుంది.

శ్రీపాద శ్రీ వల్లభ మహా సంస్థానం – ఆవిర్భావం

కర్నాటక రాష్ట్రం లోని సజ్జనగడ ప్రాంతం లో నివసించే శ్రీ రఘువీర రామస్వామి వారు, మరియు వారి తల్లిగారైన శ్రీమతి కమలమ్మ గారు ఇరువురు 1966వ సంవత్సరంలో మొట్టమొదటి సారిగా పిఠాపురం రావడం జరిగింది. వారు కుక్కుటేశ్వర స్వామి వారి ప్రాంగణంలో గల స్వయంభూ దత్తాత్రేయుడిని పూజించి, గురుచరిత్ర ఒకసారి సప్తాహపారాయణ చేసిరి. అప్పటినుండి 11 సంవత్సరాల పాటు ప్రతీ సంవత్సరం వారిరువురు వచ్చి వెళుతుండేవారు. ఒకానొక సంవత్సరం వారి తీర్ధయాత్ర లో భాగంగా నర్సోబావాడి చేరిరి. అక్కడ నర్సోబావాడి నరిసింహ సరస్వతి సంస్థానం అధ్యక్షులు వారికి "ఇటువంటి సంస్తానమే పిఠాపురంలో కూడా ఉంటే బాగుంటుందని" సలహా ఇచ్చిరి. తరువాత రఘువీర రామస్వామి వారు, శ్రీమతి కమలమ్మ గారు పిఠాపురం వచ్చి కొంత మంది సభ్యులతో "శ్రీపాద శ్రీ వల్లభ మహా సంస్థానం" అనే ఒక కమిటిని ఏర్పరిచిరి. శ్రీపాద శ్రీ వల్లభ మహా సంస్థానంనకు కొంత స్థలమున్న బావుంటుందనే ఆలోచనతో శ్రీమతి కమలమ్మ గారు అనేక స్థలములను చూసిరి. అందరికి ఆమోదయోగ్య మైన స్థలమొకటి (పాత శిధిలావస్థలో ఉన్న ఇల్లు మరియు స్థలం) దొరికింది. కాని దానిని అమ్మ వారు ఆ స్థలం యొక్క ధర రూ. 35000/- చెప్పిరి. అంత డబ్బు కమిటి వద్ద లేకపోవడం చేత ఆ ప్రయత్నమును విరమించుకొనిరి. ఇదంతా సుమారు 1978-79 ప్రాంతాలలో జరిగింది. కొద్ది సంవత్సరముల తరువాత శ్రీమతి కమలమ్మ గారు అప్పుచేసైనా సరే ఆ స్థలాన్ని కొనవలెనని శ్రీపాదుల వారిచే ప్రేరేపింపబడినారు. అంతట 1983 వ సంవత్సరంలో అప్పు చేసి ఆ స్థలాన్ని కమిటి వారు కొన్నారు. అందులో గల పాత ఇంటిని శుభ్రం చేసి ఒక చిన్న ఆసనం వేసి దాని పై దత్తాత్రేయుడు, శ్రీ పాదుడి పటాలతో పాటుగా శ్రీధరస్వామి (ముందు జన్మలో శ్రీపాదుల వారి సహోదరులు) మరియు సమర్ధ రామదాసు పటములను ఉంచిరి. ఆచిన్న ప్రాంగణం లోనే ఆ చిన్న ఇంటి పక్కనే 1985వ సంవత్సరంలో ఔదుంబరమును నాటిరి (నేడు ఆలయ ప్రాంగణం లోపల కనిపించే ఔదుంబరం) ఆవిధంగా దినదిన ప్రవర్ధమానం చెందుతూ 1987వ

సంవత్సరంలో మందిర నిర్మాణం జరిగినది. ఆ మందిరంలో 22-02-1988 లో మనం ఇప్పుడు చూస్తున్న శ్రీపాదుల వారి శ్రీ గురు చరణాలు (పాదుకలు) శ్రీ రఘువీర రామస్వామి (సజ్జనగడ రామస్వామి) వారి చేతుల మీదుగా ప్రతిష్ఠింపబడినవి. 06-02-1992 లో ఇప్పుడు మనం చూస్తున్న శ్రీ పాద వల్లభ , దత్తాత్రేయ , నృసింహ సరస్వతి పాలరాయి విగ్రహాలు ప్రతిష్ఠించబడినవి. By కీర్తి వల్లభ.



**దత్త క్షేత్రము: 24: పంచదేవపహాడ్**

ఐదు (5) మంది దేవతా మూర్తులు కొలువైఉన్న చారిత్రాత్మక పురాణ ప్రసిద్ధ ప్రాంతం 'పంచదేవ పహాడ్' ఇక్కడ గల ఐదు దేవతామూర్తులు వరుసగా 1. రుక్మిణి సహిత పాండురంగ స్వామి 2. శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి 3. ఆంజనేయ స్వామి 4. రాఘవేంద్ర స్వామి మరియు 5. విఘ్నేశ్వరుడు. వీరంతా కొలువైఉన్న ఈ గ్రామం అతి పురాతన మైనదని చెప్పుటకు చాలా ఆధారాలు కలవు. శ్రీపాద శ్రీ వల్లభుల వారు తరచుగా ఇక్కడే వారి దర్బార్ ను జరిపినట్లు ఆధారాల ద్వారా తెలుస్తోంది. ఇప్పుడు ఎక్కడైతే రుక్మిణి సహిత పాండురంగ స్వామి దేవాలయం ఉందో అక్కడే శ్రీపాద శ్రీ చరణులు దర్బార్ జరిపేవారు. ఇక్కడ గల పాండురంగ స్వామి దేవాలయం క్రీ.శ.1238 లో బాగుచేయబడినది. అంటే అప్పటికి ఎన్నో ఏళ్ళకు ముందు నుండే ఆ దేవాలయం కలదు. ఇప్పుడు ఇదే దేవాలయ ప్రాంగణం లో అనఘ-దత్త దేవాలయం మరియు 'శ్రీ పాద శ్రీ వల్లభుల దర్బార్ ' కలవు. ఇచ్చుట యాత్రికులు బస చేయుటకు వసతి కూడా కలదు. శ్రీపాదుల వారు ఎంతోమంది భక్తులకు గల వ్యక్తిగత సమస్యలను ఇక్కడనుండే తీర్చారు. కాబట్టి దత్త భక్తులందరూ దర్శించవలసిన ప్రదేశం. పాండురంగ స్వామి దేవాలయం కృష్ణానది కి దగ్గరలోనే ఉంటుంది, కాబట్టి అక్కడ నుండి కుడా

కురువపురం కు బుట్టీల ద్వారా చేరుకోవచ్చు లేదా కురువపురం నుండి వచ్చేటప్పుడు పంచదేవ పహాడ్ చేరే బుట్టిలను ఎక్కి దర్శించుకోవచ్చు. By కీర్తివల్లభ గారు



పంచదేవ పహాడ్ గ్రామం లో రుక్మిణి – పాండురంగ దేవాలయ ప్రాంగణం లో గల శ్రీపాద శ్రీ వల్లభ దర్బార్

**దత్త క్షేత్రము: 25:నవనాధ గుట్ట**

నవనాధులు ఎవరు? నవనారాయణాంశ సంభూతులే నవనాధులు వారు శ్రీపాద శ్రీ వల్లభుల ఆజ్ఞ మేరకు, శ్రీకృష్ణావతారం లో చేసిన వాగ్దానం మేరకు భూమి మీద అవతరించారు. ఋషభ చక్రవర్తికి గల 100 మంది కుమారులలో నారాయణాంశ కలిగిన తొమ్మిది మందే ఈ నవనాధులు.వీరంతా అవధూతలు మరియు దత్తాత్రేయుల వారికి ఆప్తులు. వీరిపేర్లు స్మరిస్తే చాలు శ్రీ పాద వల్లభులు సంతుష్టి చెందుతారు. నవనాధుల తో పాటుగా అడ్బంగుడు (కాపువాడు) మరియు మీననాధుడు (మత్స్యేంద్రనాధుడి కుమారుడు) కుడా నవనాధులు ఎంత ప్రసిద్ధి పొందారో అంతే ప్రసిద్ధిపొందిన వారు. వీరంతా 'నాథసంప్రదాయం' లో ఉన్నవారు. నవనాధులు

1. మత్స్యేంద్రనాధుడు 2. గోరక్షనాధుడు

3. జాలంధరనాధుడు 4. కానీఫానాధుడు

5. చర్పటనాధుడు 6. నాగనాధుడు

7. భర్తరినాధుడు 8. రేవణనాధుడు 9. గహనీనాధుడు

ఎలా చేరుకోవాలి? హైదరాబాద్ నుండి చిన్నకోడప్గల్ (పిట్లం) నవనాథసిద్ధుల గుహలను చేరుకోవడానికి రూట్ (Hyderabad To Chinna Kodapgal 190 KM).

హైదరాబాద్ నుండి చిన్నకోడప్గల్ (పిట్లం) నవనాథసిద్ధుల గుహలను చేరుకోవడానికి రూట్ (Hyderabad To Chinna Kodapgal 190 KM) కుకట్ పల్లి ----> BHEL----> పటాన్ చెరు ----> పటాన్ చెరు టోల్ ప్లాజా ----> ORR దగ్గర స్ట్రైట్ రోడ్డు (ముంబై రోడ్డు) తీసుకోవాలి ----> ఇస్నాపూర్ ----> రుద్రారం ----> రుద్రారం

తోషిబా & విజయ్ ఎలక్ట్రానిక్స్ ----> రుద్రారం తోషిబా & విజయ్ ఎలక్ట్రానిక్స్ దాటగానే వచ్చే రైట్ సైడ్ రోడ్డు తీసుకోవాలి (ముంబై హైవే దిగాలి) ----> గణేష్ గడ్డ ----> ఇస్మాయిల్ఖాన్ పేట్ ----> ఇస్మాయిల్ఖాన్ పేట్ దాటాక వచ్చే 4 రోడ్లలో లెఫ్ట్ (Left) రోడ్డు తీసుకోవాలి ----> MNR మెడికల్ కాలేజి ----> MNR మెడికల్ కాలేజి దాటాక వచ్చే ' T ' జంక్షన్ లో (3 రోడ్ల కూడలి) రైట్ (Right) రోడ్డు తీసుకోవాలి ----> ఆంథోల్ & జోగిపేట్ ----> అన్నాసాగర్ లేక్ ----> శంకరంపేట సహజ కలువల కొలను ----> శంకరంపేట ----> నాందేడ్ రోడ్ ----> పిట్లం ----> SNA రోడ్ ----> చిన్నకోడప్గల్ గ్రామం ----> గుట్ట మీద నవనాథ సిద్ధుల గుహలు. **By కీర్తి వల్లభ గారు**



నవనాథ సిద్ధులగుట్ట పై నవనాథులు తపస్సు చేసిన ప్రాంతంలో వెలసిన శివలింగం



నవనాథ సిద్ధులగుట్ట పై మత్స్యేంద్రనాథుడు ప్రతిష్ఠించిన శివలింగం

## దత్త క్షేత్రము: 26: మొమిన్ పేట్

మాణిక ప్రభు దేవాలయం మొమిన్ పేట్ లో ఏర్పడిన విధానం & శ్రీ మణిక ప్రభువుల వారి మొమిన్ పేట్ పర్యటన

శ్రీ కృష్ణమాచార్య దంపతులు సుమారు క్రీ.శ. 1860 వ సంవత్సరంలో వారి ఉద్యోగనిమిత్తం గల పని మీద హుమ్నాబాద్ నవాబును కలవడానికి వచ్చిరి. శ్రీ మాణిక ప్రభువుల వారి గురించి కర్ణాకర్ణిగా విన్న వారు మాణిక్ నగర్ వెళ్లి ప్రభు దర్శనం చేసుకోని, వారసుడు కావాలనే కోరికను అక్కడ శ్రీ మాణిక ప్రభువుల వారి ముందు విన్నవించుకొనిరి. అందుకు శ్రీ మాణిక ప్రభువుల వారు నవ్వుతూ "పిల్లవాడిని ఇస్తే ఈ పల్లెవాడు కుడా రావలసిఉండును, సరేలే తీసుకో.. నేను వస్తాలే!" అని చెప్పారట. వారు తిరిగి స్వగ్రామమైన మొమిన్ పేట్ వచ్చిన కొద్ది నెలల కాలంలో వారికి పండంటి బిడ్డపుట్టడం ఆ బిడ్డకి "మాణిక్యరత్నం" అనేపేరు పెట్టడం చకచకా జరిగిపోయాయి. అప్పటినుండి ఆదంపతులు శ్రీ మాణిక ప్రభువుల వారిని అధీష్ట దేవుడుగా కొలవడం ప్రారంభించారు. అడిగిన వెంటనే ఆశీర్వదించిన శ్రీ మాణిక ప్రభువుల వారి పై గల భక్తిని చాటుకోవడం కోసం క్రీ.శ. 1862 వ సంవత్సరంలో శ్రీ మాణిక ప్రభువుల వారికి దేవాలయం కట్టించడం ప్రారంభించారు. క్రీ.శ. 1865 వ సంవత్సరంలో శ్రీ మాణిక ప్రభువుల

వారి దేవాలయం పూర్తి చెయ్యబడినది. పిమ్మట శ్రీ కృష్ణమాచార్య దంపతుల ఆహ్వానం మేరకు జీవసమాధి చెందడానికి ఒక నెల రోజుల ముందుగా ఇచ్చిన మాట ప్రకారం మొమిన్ పేట్ వచ్చి గుడి మొత్తం కలియతిరిగి, దత్తగాదీని స్థాపించి, పాదుకా ముద్రలనూ, దండాన్ని ఇచ్చి ఆ దంపతులను ఆశీర్వదించి తిరిగి మాణిక్ నగర్ చేరిరి. **By కీర్తి వల్లభ.**

## దత్త క్షేత్రము: 27: కదలివనం

శ్రీ నృసింహ సరస్వతి స్వామి గాణుగాపురం నుంచి తన అవతార కార్యం నుంచి గుప్తం అవ్వడానికి శ్రీశైల క్షేత్రం వచ్చి పాతాలగంగ ని పుష్ప వాహనం లో దాటి,కదలివనం వెళ్లి అక్కడ గుప్తం గా 300 సంవత్సరాలు తపస్సు చేసి తరువాత స్వామి సమర్థ గా ప్రకటం అయ్యారు.ఆ ప్రాంతమే కదలివనం.

**రూట్ మాప్:** పాతాలగంగ గంగ నుంచి పడవలో 20 km దూరంలో వేంకటేష్ కినారా దగ్గర దిగి అక్కడ నుంచి నడుచుకొని సుమారు 6 km దూరంలో ఉన్న అక్క మహాదేవి గృహ లో కల దత్త విగ్రహం, శివలింగ దర్శనం చేసుకోవచ్చు. స్వామి సమర్థ పాదుకలు (వాల్మీకం)ఉంది. **BY SARAT CHANDRA**



## దత్త క్షేత్రము: 28: వరంగల్

1790-1800సంవత్సరం లో వేలది శ్రీ రామయ్య శర్మ గారు కట్టించి ప్రతిష్ఠ చేయబడిన మందిరం.ఈ మందిరం వారు గానుగపురం వెళ్లి,శ్రీ గురుని దర్శనం చేసుకొని మాణిక్య నగర్ లో మాణిక్య ప్రభువుని దర్శించి నప్పుడు వారే స్వయంగా వీరికి ఒక దత్తాత్రేయ యంత్రం,4 దండాలు ఇచ్చారు.అవి ఈ గుడిలో రోజు అభిషేకం చేయబడుతున్నాయి.

భృగు మహర్షి రచించిన శ్రీ దత్తాత్రేయ సంహిత ప్రకారం మార్గశుద్ధ చతుర్దశి(బుధవారం) రోజు దత్తాత్రేయ జయంతి ఇక్కడ చేయడం

జరుగుతుంది. ఇప్పుడు దత్త మందిరం లో 8 వతరం వారిచే పూజ లందుకుంటున్నారు.దత్తాత్రేయ నవరాత్రులు జరుగుతాయి.శ్రీ మల్లాది చంద్రశేఖర్ శాస్త్రి గారు ఇక్కడ 3 సంవత్సరాలు వున్నారు.పురాణ ం చెపుతూ.

**రూట్ మాప్:** వరంగల్ లోని చౌరస్తా లో డాల్ఫిన్ హొటల్ సందులో విద్యార్థి కంప్యూటర్ పక్కన శివాలయం,ఈ దత్త మందిరం కలదు. ఉదయం 6 గంటల నుంచి రాత్రి 11 వరకు తెరచి ఉంటుంది. ఎటువంటి డోనేక్షన్స్ తీసుకోరు.

పూజరి(శ్రీ దత్త ) Ph no.9966075554, **SOURCE; రమేష్ సోమ.**




**దత్త క్షేత్రము: 29: భాధనకుర్తి**

పురాతన దత్తాత్రేయ పాదుకలు ఎడమవైపు వ్యాస మహర్షి (బాదనారాయణ) ప్రతిష్ఠ చేసిన దత్తాత్రేయ పాదుకలు నిర్మల్ జిల్లాలో ఖానాపూర్ మండలం లోని భాధనకుర్తి గ్రామం(ఈ గ్రామం చిన్న ద్విపం)ఉరి చుట్టూ ఎనిమిది దిక్కులు కూడా 8 లింగాలతో అష్ట దిక్ భంధన లింగాలతో ప్రతిష్ట చేయబడి,పురాతన ప్రసిద్ధి గాంచిన స్థలం ఈ దివ్య క్షేత్రం. మార్గశిర శుక్ల పంచమి కి జాతర జరుగుతుంది. **SOURCE:రమేష్ సోమ. రూట్ మాప్** to భాదన్ కుర్తి దత్త క్షేత్రం.: నిర్మల్ నుంచి 25 km దూరంలో ఉన్న ఖానా పూర్ చేరి,అక్కడి నుంచి మెట్ పల్లి వెళ్లే bus లో బాధన్కుర్తి చేరవచ్చు.అక్కడి నుంచి 2 km దూరంలో సుర్జా పూర్ వెంకటేశ్వర స్వామి ని దర్శించుకోవచ్చు. **BY శరత్ చంద్ర.**

v 



## దత్త క్షేత్రము: 30: త్రిపురాంతకం

ప్రాచీన మంత్రం ,చైతన్య విద్యలకు ప్రతీక,ఓషధీ మూలికల స్తావరం , భ్రమరాంబా మల్లికార్జుల నిలయం అయిన శ్రీశైలానికి తూర్పు ద్వారంగా ప్రకాశం జిల్లాలోని త్రిపురాంతక క్షేత్రం ఉంది .శైవ శాక్తేయ క్షేత్రాలలో అత్యంత ప్రాదాన్యం పొందిన మహామహిమాన్విత దివ్య క్షేత్రం త్రిపురాంతకం స్కాంద పురాణం లో శ్రీశైలఖండం లో "త్రైలోక్య పావనం తీర్ధం త్రిపురాంతక ముత్తమం " అని చెప్ప బడిన అతి ప్రాచీన క్షేత్రం .మార్కాపురానికి నలభై కిలో మీటర్ల దూరం లో ,గుంటూరు –కర్నూలు మార్గం లో రహదారికి రెండు కిలో మీటర్ల దూరం లో ఉన్నది .

ప్రధానాలయం శ్రీ చక్రాకారం లో నిర్మించ బడింది శివాలయం ఈ ఆకారం లో నిర్మించటం చాలా అరుదు అలాటి అరుదైన దేవాలయం ఇది ."శ్రీ చక్రం శివ యొర్వపుః' ' అంటే శివ పార్వతుల శరీరమే శ్రీ చక్రం .స్వామి ఉగ్రరూపం కనుక తూర్పు గ్రామాలు తగలబడి పోయాయట .అందుకే ఆ ద్వారాన్ని మూసేశారు .పక్కగా ఉన్న దారి గుండా వెళ్లి దర్శనం చేసుకోవాలి .లోపల స్వామికి ఎదురుగా నందీశ్వరుడు ఆకర్షణీయం గా ఉంటాడు .జల లింగాన్ని దుండగులు పీకేస్తే కొండడ కిందఉన్న శ్రీరామ ప్రతిష్టిత లింగాన్ని తెచ్చి ప్రతిష్టించారు .పునః ప్రతిస్టలో మూల విరాట్ ను కదిలించకుండా మూల విరాట్ కు కింద మరొక నర్మదా బాణ లింగాన్ని ప్రతిష్టించారు త్రిపురాన్తకేశ్వరునికి ఉత్తరాన పార్వతీ దేవి అంటే స్కంద మాత ఆలయమున్నది. పై రెండు చేత్రులలో శాక్తేయ చిహ్నాలైన త్రిశూలం ,డమరుం కింది చేతులలో పద్మాలు కలిగి ఉంటుంది .అమ్మవారి ముందు కాశీ విశ్వేశ్వర లింగం ఉంది . శ్రీ బాలా త్రిపుర సుందరీ దేవి ఆలయం, శ్రీ చక్ర పాదుకలు, మెట్లు దాటి బయటికి వస్తే శ్రీ చక్ర మండపం కనిపిస్తుంది .ఇక్కడే శ్రీ చక్ర పాదుకలున్నాయి .అర్చనలన్నీ వీటికే చేస్తారు .అందరూ వీటిని పూజించ వచ్చు. ఈ చక్ర పాదుకలకు ,చిదగ్ని కుండ దేవికి తంత్ర సంబంధ అను సంధానం ఉంది .ధనం కా వాలంటే ఎరుపు రంగు విద్య కావాలంటే తెలుపు ,శత్రు జయం కలగాలంటే నల్లని స్వరూపం తో అమ్మవారిని ధ్యానించాలి .ఈ పాదుకల వెనుక సిద్ధేశ్వర పాదుకలుంటాయి .వీటిని "గురుపాదాలు "అంటారు .శ్రీ విద్యా సాంప్రదాయం లో వీటి ప్రాధాన్యం ఎక్కువ .గురుపాదుకలకు ప్రక్కనే బ్రాహ్మీ లిపి లో "గురుపాదకా మంత్రం ఉంది' ' .చక్ర మండలం నైరుతి భాగం లో శ్రీ దక్షిణా మూర్తి లింగం ఉంది .స్వామికి ఇక్కడే అభిషేకం చేస్తారు

ప్రాచీన మంత్రం ,చైతన్య విద్యలకు ప్రతీక,ఓషధీ మూలికల స్తావరం , భ్రమరాంబా మల్లికార్జుల నిలయం అయిన శ్రీశైలానికి తూర్పు ద్వారంగా ప్రకాశం జిల్లాలోని త్రిపురాంతక క్షేత్రం ఉంది .శైవ శాక్తేయ క్షేత్రాలలో అత్యంత ప్రాదాన్యం పొందిన మహామహిమాన్విత దివ్య క్షేత్రం త్రిపురాంతకం స్కాంద

పురాణం లో శ్రీశైలఖండం లో "త్రైలోక్య పావనం తీర్థం త్రిపురాంతక ముత్తమం " అని చెప్ప బడిన అతి ప్రాచీన క్షేత్రం .మార్కాపురానికి నలభై కిలో మీటర్ల దూరం లో ,గుంటూరు –కర్నూలు మార్గం లో రహదారికి రెండు కిలో మీటర్ల దూరం లో ఉన్నది .

**దత్త క్షేత్రము: 31: దత్త మందిరం, గోపాల్ పెట్, మెదక్ జిల్లా.**

ఊరి పొలిమేరలో సుందరమైన వనంలో శ్రీ రాములవారి ఆలయం 1996 లో ప్రతిష్ఠ చేయబడింది. దేవాలయం ఎదురుగా వేప, మర్రి, రావి, జువ్వి, మామిడి చెట్లు ఒకేచోట నాటారు. దేవాలయంలో అనేక వృక్షాలు ఉండటం వల్ల మనసుకు ఆహ్లాదకరంగా ఉంటుంది. అందులో దత్త దేవాలయం 31-3-2004 లో ప్రతిష్ఠించారు. అందు ప్రధాన దేవాలయం శ్రీరామాలయం తో పాటుగా హనుమాదాలయం,సంతోషి మాత ఆలయం,దత్త దేవాలయములు అను ఉప ఆలయములు కలవు. మెదక్ నుండి ఎల్లారెడ్డి వెళ్లే దారిలో,గోపాల్ పేట్ పోలీసు స్టేషన్ సమీపంలో దేవాలయం కలదు. ఆ దారిలో వెళ్ళువారు తప్పక దర్శించగలరు. 14 సంవత్సరములుగా అర్చకులు మా తోడల్లుడు కాకిరాల ప్రసాద్ శర్మ గారు సేవ చేస్తున్నారు. వారి అబ్బాయి నంబర్

+918309123428 నరసింహ శర్మ, నూకల హరికృష్ణ శర్మ-9441188158




**దత్త క్షేత్రము: 32: పొలస దత్తాత్రేయ క్షేత్రం**

ఈ దత్తాత్రేయ మందిరం జగిత్యాల దగ్గర వుంది. ఇక్కడ సత్యనారాయణ వ్రతం లకు ప్రసిద్ధి.ఇక్కడ సప్త మాతృకలు కలిగిన శివ మందిరం ఉంది.చక్కటి నల్ల రాతి దత్తాత్రేయ విగ్రహం ఉంది. **By కీర్తి వల్లభ.**






**దత్త క్షేత్రము: 33: హైదరాబాద్ హిమాయత్ సాగర్ కట్ట పై,స్వయంభూ దత్తాత్రేయ మందిరం.**

హిమాయత్ సాగర్ కట్ట దగ్గర సుమారు 400 సంవత్సరముల చరిత్ర కలిగిన దేవాలయం ఉన్నది. హిమాయత్ సాగర్ కట్ట పై. TSRI అనే ఆఫీసులో ఉన్న దేవాలయం అది. వెళ్లి స్వామిని దర్శించిన తరువాత, అభిషేకం చేసుకోవాలి అనే సంకల్పంతో వెళ్ళాము కనుక గుడి తాళం చెవి కోసం మళ్ళీ వెతుక్కుంటూ వెళ్లగా, అరగంటసేపు తిరిగిన తరువాత, మొత్తానికి దొరికింది. ఆనందంతో అభిషేకం పూజ ముగించుకున్నాము. సరిగ్గా అక్కడవారికి ఎన్ని సంవత్సరాల చరిత్ర కలిగియున్నది అని తెలియదు. స్వామి స్వయంభూ మూర్తి, దండ కమండలములతో చక్కటి తేజస్సుతో వెలుగొందుతున్నాడు. సువిశాలమైన అశ్వత్థ వృక్షం క్రిందన పురుడు రాజు అనే యోగి విగ్రహం కలదు. వారు ఇక్కడ సాధన చేసిన మహనీయులు. దత్తునితో పాటుగా, వినాయక, రామాలయములు కూడా కలవు. ఈదేవాలయం గ్రామములో కాకుండా, తెలంగాణా, రీసెర్చ్ ల్యాబ్ అనే ఆఫీసులో ఉండడంచేత, నిత్య పూజ, ధూప,దీప నైవేద్యములు సరిగ్గా జరగడం లేదు. అవకాశం ఉన్నవారు స్వామిని దర్శించి తరించగలరు. అవధూత చింతన శ్రీ గురుదేవ దత్త. **SOURCE హరికృష్ణ శర్మ**



**దత్త క్షేత్రము: 34: సీతారాం బాగ్**

సుమారు 300 సంవత్సరాలు పైన ఉన్న దత్తాత్రేయ మందిరం.అతి ప్రశాంత వాతావరణంలో గల దత్తత్రేయ మందిరం.శ్రీ దత్త భక్తులు సిద్ధేశ్వర మహరాజ్(80ల వయస్సు) గారి సమాధి కూడా ఉంది .మారేపల్లి చౌరస్తా లో నుంచి కనపడుతుంది.200 మెట్లు పైన ఉన్న దత్తాత్రేయ గుట్ట(పహాడ్)..ఇక్కడ భావి కూడా ఉంది.ఈ మధ్యనే మూసేశారు.దత్తాత్రేయ విగ్రహం అధ్భుతం గా ఉంటుంది. దత్త జయంతి జరుగుతుంది. జై గురు దత్త. By M. లక్ష్మీ గారు. మందిరం పూజరి గారు ప్రశాంత్ +918897099592.




**దత్త క్షేత్రము: 35: అనసూయ,అత్రి సమేత దత్తత్రేయ మందిరం నిజామాబాద్**

1825 సంవత్సరం లో ప్రతిష్ఠ చేసిన ఏక ముఖి దత్తాత్రేయ మందిరం ఇది.

శ్రీ సంత్ ఆచార్య(నాగాజీ భట్)గారు నాందేడ్ లోని సాధు మహరాజ్(దత్త ఉపాసకులు)మహనీయులను సేవించుకునే వారు. వారి శిష్యులు అందరూ దత్త సాక్షత్ కారం కావాలని గురువు గారిని వేడుకగా గురువు గారు శిష్యులతో తనకు కండోబా కి ఎడమ చేయి ఇస్తాను అని మొక్కు ఉంది అది ఇంకా తీరలేదు అని బాధ పడతారు.వీరు వెళ్లి దేముని కి ఎడమ చేయి ఇచ్చి,వచ్చి గురు సేవ చేస్తుంటారు.గురువు గారు ఆశ్చర్య పోయి విషయం తెలుసుకుంటారు.దత్త దర్శనం చేయిస్తాను అని మహుర్ ఘడ్ కి.తీసుకెళుతుంటారు.దారిలో దత్త స్వామి దర్శనం కలిగి తాను ఏక ముఖి దత్తాత్రేయ స్వామి గా ఇందుర్ అనే ఊరు లో వున్నాను అని,ఇక్కడకు రావద్దు,అక్కడకి వెళ్లి సేవించు అని సంత్ ఆచార్య కి అజ్ఞాపిస్తారు. దత్తాత్రేయ ఆజ్ఞ పై నిజామాబాదు లోనే దత్తాత్రేయ విగ్రహం కనుగొని అక్కడే ప్రతిష్ఠ చేసి సుమారు 350 సంవత్సరాలు క్రితం ఈ మందిరం నిర్మించారు.ఈ మందిర విశేషం ఏమిటంటే దత్తత్రేయ విగ్రహం కింద ఒక స్త్రీ మూర్తి,ఒక పురుషుడు కనపడతారు. వారు అనసూయ, అత్రి మహర్షి.ఇప్పుడు దత్తత్రేయ స్వామి

ఎదురుగా ఆంజనేయ స్వామి విగ్రహం ఉంది.ఇక్కడే సంత్ ఆచార్య సమాధి కూడా ఉంది.ఇప్పటికి ఆ వంశస్థులు మహుర్ ఘడ్ వెళ్తారు.

**రూట్ మాప్:** నిజామాబాద్ లో బస్ స్టాండ్ నుంచి సంత్ ఆచార్య మఠం అంటే ఎవరైనా చెప్తారు.గాజుల పేట గురుద్వారా కి ఎదురుగా ఉంటుంది. **Source: పవన్ శర్మ వేలెటి ఫోన్ నెంబర్:09394724529**






**దత్త క్షేత్రము: 36: పలాసా**

నెమలి కొండ,వెండికొండ మధ్యలో సుమారు 150-175 సంవత్సరాల దత్తాత్రేయ మందిరం ఉంది.అక్కడ ఆవులు కాచుకొనే రాముడు అనే అవధూత దత్తోపసన లో ఉండేవారు. ఆవులు ఈ కొండ కి తీసుకొచ్చి,అవులకు చుట్టూ గీత గీసి, తాను జై గురు దత్త, శ్రీ గురు దత్త అని నిరంతరం ధ్యానం లో ఉండేవారు.ఎవరికైనా తప్పి పోతే ఆ వస్తువులు ఎక్కడ ఉన్నాయో చెప్పేవారు.ఎక్కువగా ముళ్ళ మీద చిన్మయా నందం లో పడుకొని ఉండేవారు.చివరకు అక్కడే ఉన్న బిల్వం లోకి వెళ్లిపోతూ ఉంటే జనం పడిపోతున్నారు అని చివరిలో వారి జుట్టు పట్టుకున్నారు.దేహం కనిపించలేదు.జుట్టు మాత్రం వీరి చేతికి వచ్చింది. వీరిని వెండి రామ్మన అని పిలిచేవారు.తరువాత అటుగా వెళుతున్న "పరమహంస" ఆ ఆధ్యాత్మిక వాతావరణం కు మృద్దులై అక్కడే ఉండి క్రియాయోగం చేసేవారు.ఇక్కడ అనఘాష్టమి వ్రతం, దత్త జయంతి బాగా జరుగుతుంది. నిరంతరం అనఘమాత భోజన శాల లో అన్నదానం జరుగుతుంది. ధ్యాన మందిరం ఉంది. **SOURCE:సాయి ధర్మపురి, 08374795475.**

**దత్త క్షేత్రము: 37: ఆళ్లగడ్డ-కోయల కుంట (కర్నూల్ జిల్లా)మధ్యలో భీముని పాడు**

ఆళ్లగడ్డ-కోయల కుంట (కర్నూల్ జిల్లా)మధ్యలో భీముని పాడు అనే పల్లెటూరు లో అనంత పద్మనాభ స్వామి గారిచే మేడి చెట్టు క్రింద ప్రతిష్ఠ చేసిన మందిరం. వీరు కేరళ వారు.కాశి నయన గారి చే మహా యోగిగా కొనియడబడ్డారు.త్రిపురా ఉపాసన చేశారు.శ్రీ శ్రీ శ్రీ దత్తాత్రేయ స్వామి మందిరం ప్రసన్న . **రూట్ మాప్**: ఆళ్లగడ్డ నుంచి కోయలకుంట వెళ్లే బస్ లో పద్మనాభ స్వామి ఆశ్రమం stop లో దిగాలి. ఉదయం 10 నుంచి 4 వరకు దత్త మందిరం మూసి ఉంటుంది. **SOURCE మణి దీప్, PH NO.7013406405.**



**దత్త క్షేత్రము: 38: జగనాధ కొండ,దూ పాడు, కర్నూలు**

ఇది అతి పురాతనమైన "శ్రీ దత్త" దేవాలయం. ఇక్కడ గల కోనేరులో దేవతలు వచ్చి స్నానం చేస్తారని ప్రతీతి. అందుకే ఈ కోనేరును దేవతల కోనేరు అని, ఆర్మేట్ల కోనేరు అని అంటారు. ఇక్కడ గల మరొక విశేషం శ్రీ అనఘాదేవి సమేత దత్తాత్రేయులవారు, నారద మహర్షి మరియు శ్రీ ఆంజనేయ స్వామి వారు ఏకశిలా విగ్రహముపై కొలువై వుండడము. ఇచ్చట శివ లింగము మరియు నంది విగ్రహాలు కూడా కొలువైవున్నాయి. ప్రస్తుతము శిధిలావస్థలో వున్న ఈ ఆలయాన్ని పునరుద్ధరించాల్సిన అవసరంవుంది. ఈ ఆలయం కర్నూలు జిల్లాలోని దూపాడు దగ్గర గల జగన్నాథ కొండపై వున్నది**. అడ్రస్**-జగనాధ కొండ,దూ పాడు, కర్నూలు. కు 4 km.శ్రీ శైలం నుంచి 180 km. **SOURCE-శివ శంకర్, PH NO.9100563675**







## దత్త క్షేత్రము: 39:  ఆళ్లగడ్డ తాలూకా, s.లింగం దిన్నె కర్నూలు జిల్లా

కర్నూలు జిల్లా, ఆళ్లగడ్డ తాలూకా, s.లింగం దిన్నె అనే వూరిలో వున్న దత్త క్షేత్రం. ఇక్కడ ధరణి సీతారామచంద్ర యోగి జీవ సమాధి వున్నది. వీరు శ్రీ శైలం లో తపస్సు లో వున్నప్పుడు దత్త స్వామి స్వయంగా దర్శనం ఇచ్చి మంత్రోపదేశం చేశారు. తరువాత పార్వతీ పరమేశ్వరులు దర్శనం అనుగ్రహించి క్షేత్రం విడిచి ధర్మ ప్రచారం చెయ్యమని ఆదేశించగా వారు అనేక చోట్ల పర్యటించి అలాగే చేశారు. వీరు తరువాత లింగందిన్నెలో ఒక చెట్టు క్రింద కూర్చొని అనేక లీలలు చేశారు. మార్గశిరమాసం దత్త జయంతి రోజున వారు ప్రతిష్ఠించిన శివాలయం ప్రక్కనే సజీవ సమాధి చెందారు. వారు కూర్చున్న మర్రిచెట్టు ఇప్పటికీ వుంది. శ్రీ గణపతి సచ్చిదానందస్వామి వీరిని దర్శించి దత్త విగ్రహం ప్రతిష్ఠించారు. వారికి సాక్షాత్కరం లభించినట్లు తెలిపారు. ఇది ఇప్పుడు శ్రీ శ్రీ శ్రీ ధరణి సీతారామస్వామి గురు దత్త మఠం గా విలాసిల్లుతున్నది. Source : మణిద్వీప్



